# నన్నయ భట్టు

ఆచార్య దివాకర్ల వేంకటావధాని

ప్రచురణ

రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

NANNAYA BHATTU : An Introduction to the first Telugu poet Nannaya Bhattu and his work Andhra Mahabaratam by prof. Divakarla Venkatavadhani.



యువభారతి

ప్రచురణ : 117

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1986

ప్రతులు : 3000

ముఖచిత్ర రచన : శ్రీ శీలావీర్రాజు

ముద్రణ ; సువర్ణ ముద్రణాలయ
నల్లకుంట, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు–500020.

ఇన్నర్ టైటిల్స్ ముద్రణ : ఎ.ఎస్. ఆర్ట్ ప్రింటర్స్,
తిలక్‌నగర్, హైదరాబాదు–44.

ప్రతులకు :
యువభారతి, 5 కింగ్స్‌వే, సికిందరాబాదు–500003.

'యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ 10/–

# ఆంధ్ర కవి నక్షత్రమాల

వెయ్యేళ్ళ తెలుగుసాహితి సృష్టిస్థితి వికాసాలను గూర్చి తెలుసుకోవలసిన అగత్యం అందరికీ ఉంది. పరిశీలన దృక్పథంతో అధ్యయనం చేసే పండితులకు కావ్యాలు విమర్శలు పరిశోధన గ్రంధాలు అనేకం ఉన్నవి. కాని తెలుగుభాషతో సామాన్యపరిచయంఉన్న వ్యక్తికి తెలుగుసాహిత్యంలో ధృవ తారలుగా నిలిచిన మహాకవులను గూర్చి స్థూలంగానైనా తెలుసుకోవడానికి సరళమైన భాషలో, సుగమమైన విధానంలో, కొనడానికీ చదువుకొనడానికీ అనువుగా ఉండే చిన్న పుస్తకాలు వెలువడాలని, యువభారతి అందుకు పూనుకోవాలని, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఆదేశించినారు. తామే స్వయంగా 27 చిన్న పుస్తకాలలో దాదాపు ఏబది మంది ప్రాచీనఅధునాతన ఆంధ్ర మహాకవులను గూర్చి వ్రాసి ఇస్తామని యువభారతికి అభయమిచ్చినారు. ఈ చిన్నపుస్తకాల మాలకు ఆయనే "ఆంధ్ర కవి నక్షత్రమాల" అని నామకరణంకూడ చేసినారు.

ఆ మహాత్ముడు తన ఆదేశం మేరకు మొదటి పుస్తకం "నన్నయభట్టు" వ్రాసి ఇచ్చినారు. మిగిలిన పుస్తకాలను పూర్తి చేయాలనుకున్న సందర్భంలో విధిప్రేరణచేత ఆయనయజుర్వేదాన్ని తెనిగించే ప్రయత్నంలో నిమగ్నులైనారు. ఆ రచనసాగిస్తూనే తమ నిరంతర సాహితీయాత్ర కొనసాగిస్తూ, ప్రభవ వ్యాస పూర్ణిమ నాటికి ఇరువయ్యేడు పుస్తకాల రచన ముగిస్తామనికూడా అన్నారు. కాని దైవంఅనుకూలించలేదు. అక్టోబరు 20, 1986 నాడు ఆ తెలుగువెలుగు ఆరిపోయింది. తెలుగు హృదయాలను నిరామయం చేయడానికి ఉద్యమించిన ఆ మహా భాషాతపస్వి నిర్యాణం మా కవినక్షత్రమాలా కార్యక్రమానికి స్వస్తి పలికింది. ఈ పనిని ఇతరులు చేయలేరని యువభారతి అనుకోవడం లేదు. కాని ఆ వాఙ్మయ దివాకరుని హృదయాన్నీ సందేశాన్నీ అందించాలని యువభారతి మనసారా నమ్మింది.

ఆంధ్ర కవి నక్షత్రమాల నిర్మాణ ఉద్దేశ్యాలకు సంబంధించిన వివరాలను ఆచార్య అవధానిగారే వివరించిఉన్నారు. ఈ కార్యక్రమ సందర్భంగా మాకు చేయూతనిచ్చి ప్రోత్సహించిన సహృదయులకు కలిగిన నిరాశ యువభారతికేంతో మనఃక్లేశం కలిగిస్తునది. యావదాంధ్ర దేశంలోని సాహిత్యాభిమానులు మా అశక్తతను గుర్తిస్తారని ఆశిస్తున్నాం. ఆంధ్రకవి నక్షత్రమాల ప్రచురణకు అంతరాయం కలగడానికి మేము బాధ్యులం కాకపోయినా క్షంతవ్యులం.

యువభారతి

# మామాట

సంస్కృతికి వచోరూపం భాష. తెలుగుభాషను కావ్యరచనకు అనుకూలంగా మలిచి, సర్వలక్షణ లక్షితమైన తొలితెలుగుకావ్యం-ఆంధ్రమహాభారతాన్ని అందించిన మహాకవి నన్నయ్యభట్టు. కావ్యరచనేకాదు, ఆంధ్రీకరణ విధానానికీ, చక్కని తెలుగునుడికారపు ఇంపుసొంపులకు, నాదమాధురికి, అర్థగాంభీర్యానికీ, బహుముఖీన విజ్ఞాన సంపదకు ఆంధ్రమహాభారతం కాణాచి. నాటికీ, నేటికీ నన్నయ్యభారతం ఎందరో మహాకవులకు ఆదర్శకావ్యం. నన్నయభారతం చదువనివాడు తెలుగులో ఏమీ చదువనివాడే.

నన్నయ్యభట్టు వ్యాసప్రోక్తమైన మహాభారతాన్ని పూర్తిగా తెనిగించలేదు. ఆయన వ్రాసిన మొదటి రెండున్నర పర్వాలుమాత్రమే మనకు దక్కినవి. మిగిలిన భారతాన్ని తిక్కన్న, ఎఱ్ఱనలు పూర్తిచేసి చరితార్థులైనారు.

నన్నయభారతంలోని కొన్ని చక్కని పద్యాలను ఏరుకొని, వాటికి సరళమైన వ్యాఖ్యానాన్ని జోడించి ఆచార్య అవధానిగారు ఇంతకుముందే "నన్నయ కవితావైభవా"న్ని వ్రాసిఇచ్చి యువభారతికి ప్రచురించుకొనే అవకాశాన్ని కల్పించినారు. ఆ పుస్తకం ప్రతులన్నీ తెలుగులోగిళ్ళలోకి చేరిపోయినవి.

"నన్నయభట్టు" అన్న ఈ చిన్న పుస్తకం నన్నయ సాహిత్య వ్యక్తిత్వానికి అద్దంలాంటిది. "కొండ అద్దమందు కొంచెమై" కనిపించినట్లు నన్నయప్రతిభ మహాభారతప్రశస్తి నన్నయ విజ్ఞానసిరతి, నన్నయకవితాపారమ్యం ఈ పుస్తకంలో సాక్షాత్కరిస్తాయి. ఈ పుస్తకం చదివితే ఆదికవిని దర్శించినంతఫలం లభిస్తుంది. ఇట్లే ప్రాచీన, అద్యతన, ఆంధ్ర మహాకవులను గూర్చి అవధానిగారు ఆలోచనామృతం మనకు ఉండి ఉంటే మనం ధన్యాత్ములమయ్యేడి వారమే. కాని విధి మనకు ఆ అమృతాన్ని దక్కకుండా చేసింది.

తమ నిర్యాణానికి పూర్వం ఆయనమాకు వ్రాసిఇచ్చిన పుస్తకం ఈ "నన్నయభట్టు" ఆచార్య అవధానిగారి ఈ సత్కృతికి యువభారతి ధన్యవాదాములను సమర్పించుకుంటుంది. సంప్రదాయ సిద్ధమైన సాహిత్యంపట్ల తెలుగుప్రజలు అభిమానాన్ని, ఆదరాన్ని పెంపొందించుకొని ఆ మహితాత్ముని ఆశయాన్ని నెరవేరుస్తారని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు
యువభారతి




“మహాభారతం-మహాకావ్యం” అన్న అంశంపై యువభారతి వేదిక నుండి ప్రసంగిస్తున్న ఆచార్య. దివాకర్ల వేంకటావధాని గారు.

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

# దివ్యస్మృతి

ఆచార్య దివాకర్ల వేంకటవధానిగారు ప్రతిభావ్యుత్పత్తి అభ్యాసాలు మూర్తీభవించిన వ్యక్తిత్వం కలిగిన వారు. సంస్కృత ఆంధ్ర ఆంగ్ల భాషలలో ఆయనది అంచులు ముట్టిన వైదుష్యం. పద్యరచనలోనూ, గద్యరచనలోనూ ఆయన సిద్ధహస్తులు. ఆంధ్ర నాటకపితామహుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులను గూర్చి, నన్నయభట్టు కవితాతత్త్వాన్ని గూర్చి, ఆంధ్రవాఙ్మయ ఆరంభదశనుగూర్చి ఆయన చేసిన పరిశోధన ప్రామాణికం, ఎందరికో ఆదర్శప్రాయం. ఆయన అష్టావధాన కవితావిశారదులు. పాణినీయవ్యాకరణ రహస్యాల నెరిగిన మనీషి. నాటక రచనలోనూ తన నైపుణ్యాన్ని నిరూపించుకున్న కళామూర్తి. సంప్రదాయసిద్ధములైన ఛందస్సులలోనే కాక మాత్రా ఛందస్సులలోనూ మహాకావ్య నిర్మాణదక్షతను నిరూపించుకొన్న సత్కవి. వైదిక, లౌకిక దార్శనిక విజ్ఞానాన్ని తలస్పర్శిగా అవగాహన చేసుకొన్న శేముషీసంపన్నుడు. నిర్మల హృదయంతో వాత్సల్యంతో శిష్యులకు సాహిత్యాన్ని రంగరించి పోసిన ఉత్తమ దేశికుడు. వాగ్మివతంసులు. జలదస్వన గంభీర స్వరంతో ఆయన ప్రసంగించని విద్వత్సభలేదు. పల్లెలేదు, పట్నంలేదు. సంస్కృత కావ్యాలనుగూర్చి, తెలుగు కావ్యాలనుగూర్చి, నాటకాలనుగూర్చి, కథలను గూర్చి, నవలలనుగూర్చి, వచన కవితలనుగూర్చి గుణగ్రహణ పారీణతతో అయన చేసిన ఉపన్యాస తరంగాలలో ఓలలాడని తెలుగు రసికుడులేడు. ఔదార్యానికీ, సౌశీల్యానికీ, నైర్మల్యానికీ ఆయన హృదయం ఆలవాలం. "వర్తమాన కవులకు శుభంబు పలికిన" ఇప్పటి మన పోతన శ్రీ దివాకర్లవారు. ఆయన వ్రాసిన బహు పీఠికలే ఆయన సహృదయత్వానికి ఎత్తిన వైజయంతికలు.

ఆచార్య దివాకర్ల వేంకటవధానిగారు యువభారతికి నిర్దుష్టమైన కార్యక్రమాన్ని అందించి, ప్రోత్సహించి, ఆశీర్వదించి, అన్నివేళలా పెద్దదిక్కై దాదాపు రెండు దశాబ్దాలపాటు నేతృత్వం వహించిన సాహిత్యోద్యమకర్ణధారులు.

మేము ప్రతిసంవత్సరం నిర్వహిస్తున్న లహరి కార్యక్రమాలు ఆయన శ్రీకారం చుట్టనిదే ప్రారంభం కాలేదు. లహరీ కార్యక్రమాలలో మా యువభారతి వేదిక మీద నన్నయ, తిక్కన, నన్నెచోడుడు, నాచనసోమనాథుడు, శ్రీనాథుడు, పెద్దన రామరాజభూషణుడు, శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణుడు, అభినవపోతన వానమామలై వరదాచార్యులు, శంకర భగవత్పాదులు, కాళిదాసు, తిరుపతివేంకట కవులు, వాల్మీకి, వ్యాసుడు, విశ్వనాథ సత్యనారాయణాది మహాకవులను గూర్చి ఆచార్యులవారు చేసిన ప్రసంగాలు అక్షర రూపం దాల్చినవి. ఆ మహా మనీషి ఉపన్యాస సభలు యువ భారతి చరిత్రలోనేకాదు జంటనగరాల సాహిత్య చరిత్ర లోనే అపూర్వము. అంత విశాలమైన ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణం చిన్నదై పోయింది. వేలసంఖ్యలో శ్రోతలు ఆచార్యులవారి ఉపన్యాసములను విని తన్మయులైనారు. ప్రాచీన ప్రబంధాలను గూర్చి ప్రసంగించి ఆధునికుల హృదయాలను చూరగొన్న అరుదైన వాగ్మిశేఖరులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు.

ప్రాచీనాంధ్రసాహిత్య సంప్రదాయానికి ప్రతీకగా ఆయన వ్యక్తిత్వం మాకు దారి చూపిస్తూనే ఉంటుంది. వెలుగులు చిమ్ముతూనే ఉంటుంది. ఆంధ్ర ప్రజలు ఆయనకు అఖండ గౌరవాన్ని అందించి కృతార్థులైనారు. తమసమృద్ధమైన సంస్కృతిని ఆయనలో దర్శించి ధన్యులైనారు.

మొన్ననే జరిపిన "జగద్గురుసాహితీలహరి" సందర్భంగా ఆయన అందించిన ఆశీస్సుధలేమాభాగధేయంగా మిగిలిపోయినవి. అవి మాకుపాథేయాలుగా ఉంటూ మమ్మల్ని అభ్యుదయ పథంలో నడిపిస్తుంటాయని నమ్ముతున్నాము.

ఆంధ్ర వాఙ్మయ దివాకరులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి దివ్యస్మృతికి యువభారతి భక్తి పురస్సరంగా కృతజ్ఞతా పూర్వకంగా అభివందనాలు సమర్పిస్తున్నది.

యువభారతి.

# విజ్ఞప్తి

ఆంధ్రమున వాఙ్మయ చరిత్రలును కవి జీవితములును పెద్దవో చిన్నవో చాల కలవు. వాఙ్మయ చరిత్రలలో కవి జీవితములను గూర్చియు, కవి జీవితములలో ఆయాకవులు సృజించిన వాఙ్మయమందలి విశేషములను గూర్చియు సమగ్రమైన విషయము లభింపదు. వాఙ్మయ చరిత్రలు పలువురు కవులను గూర్చియు వారు రచించిన కావ్యములను గూర్చియు తెల్పవలసి వచ్చుటచే అందొక్కొక్క కవిని గుఱించి పది పదునైదు పుటలకంటె నెక్కువ వ్రాయుట కవకాశముండదు అందుచే కొందఱు మహాకవుల జీవిత సాహిత్య విశేషములనైన వాఙ్మయ విద్యార్థులు విపులముగా తెలిసికొనవలసిన అవసరమున్నది. పరీక్షా దృష్టితో పరికించినను ముఖ్యులైన మహాకవుల వృత్తాంతము నెఱుంగుట అత్యంతావశ్యక మనిపించును.

ఆంగ్లమున "English men of Latters" అనుపేర రచింపబడిన గ్రంథ పరంపరను నేను చూచుట తటస్థించినప్పుడా విధముగా Telugu men of Latters" అను గ్రంథ పరంపరను కూడ ప్రచురించుట ఉన్నత పట్టములను బడయగోరు విద్యార్థులకేకాక సాహిత్యాభిమానులకును మిక్కిలి ఉపయోగకరముగా నుండునని తలంచితిని. ఈ విషయము హైదరాబాదు నందలి యువభారతి సంస్థ వారికి తెల్పగా వారా గ్రంథ పరంపరను ప్రచురించుటకుత్సాహము ప్రదర్శించిరి. సాహిత్య సాంఘిక తత్త్వవిషయముల నాంధ్ర దేశమునందలి అక్షరాస్యు లందఱికి నందించుటకై ఆ సంస్థవారు చేయుచున్న అవిరళమైనకృషి యెల్లరెఱింగినదే. వారు వెలయించిన లహరులు జీవనముల వోలె దేశము నలుమూలల ప్రసరించి రసానందమును పంచిపెట్టు చున్నవి. ప్రతిగ్రంథమును ప్రకటించుటకు ముందా గ్రంథము నందలి విషయమును గూర్చి ఉపన్యాసమిప్పించుట వారికి పరిపాటి. ఆ సంప్రదాయ మీ సందర్భమునఁగూడ పాటింపఁబడును.

ఈ గ్రంథ పరంపర కాంధ్ర కవి నక్షత్రమాల అను నామకరణము చేసితిమి. నక్షత్ర శబ్దమా పరంపర యందలి గ్రంథముల సంఖ్యను సూచించు నదే కాని కవుల సంఖ్యకు సంబంధించినది కాదు. ఏలయన కొన్ని గ్రంథములలో నొకే వర్గమునకు చెందిన యిరువురు లేక ముప్వురు కవులను గూర్చియు వారి కావ్యములను గూర్చియు వివరింపఁబడును. మొత్తము మీఁద యిరువదేడు గ్రంథ ములలో నలువదిమంది కవులయు, వారి కావ్యములయు విషయము విశదీకరింప బడును. ఈ గ్రంథములలో కవిజీవితము, కాలము, గ్రంథములు వాని పౌర్వా పర్యము, గ్రంథస్థ విషయము, రసపాత్ర పోషణము, తత్కాల పరిస్థితులు, భాషాచ్ఛందో విషయములు, కవికి వాఙ్మయమునఁగల స్థానము విపులముగా, చర్చింపఁబడును. ఈ గ్రంథ మాంధ్రకవి నక్షత్ర మాలలో మొదటిది.

ఈ నక్షత్రమాలలో ప్రకటింపఁబడు గ్రంథముల వివరము. 1. నన్నయ భట్టు 2. శివకవిత్రయము 3. తిక్కన 4. ఎఱ్ఱన నాచన సోమనాథుఁడు 6. రామాయణకవులు 7. శ్రీనాథుడు 8. పోతన 9. పెద్దన్న 10. నంది తిమ్మన 11. ధూర్జటి, అయ్యల రాజురామ భద్రుఁడు 12. భట్టుమూర్తి 13. తెనాలిరామకృష్ణుఁను 14. పింగళిసూరన్న 15. మాదయగారి మల్లన, సంకు సాల నృసింహకవి 16. శ్రీకృష్ణ దేవరాయలు 17. తాళ్ళపాకకవులు 18. రఘు నాథ భూపాలుఁడు 19. చేమకూర వేంకటకవి 20. కూచి మంచి తిమ్మకవి 21. ఆంధ్ర కవయిత్రులు 22. వేమన, కొందరు శతక కవులు, 23. తిరుపతి వేంకటేశ్వర కవులు 24. విశ్వనాథసత్యనారాయణ 25. పింగళి కాటూరి కవులు 26. శేషశాస్త్రి రాజశేఖర శతావధాని 27. గురుజాడ, రాయప్రోలు, శ్రీశ్రీ. ఒక్కొక్క గ్రంథములో 100 మొదలు 116 పుటలవరకు నుండును.

సాహిత్యాభిమానులీ సందర్భమున ఏర్పాటు చేయబడు నుపన్యాసముల కరుదెంచి గ్రంథ ప్రచురణమును ప్రోత్సహించి యువభారతీ సంస్థ యితోధి కముగా సాహిత్య సేవచేయుటకు ప్రోత్సహము కల్పింతురని వేడుచున్నాము.

దివాకర్ల వేంకటావధాని

శ్రీ

# నన్నయభట్టు

నెట్టుకాని కొల్తు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌమునిఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభున్ —శ్రీనాథుడు.

నన్నయ కాదికవియనియు వాగనుశాసనుడనియు బిరుదములు కలవు. ఆదికవి అనగా మొదటికవి అనియర్థము. దీనిని బట్టి అతనికి ముందు తెలుగున నసలు కవిత్వమేలేదని భావింపరాదు. అప్పుడు తేటగేతి, ఆటవెలది, సీసము, మధ్యాక్కఱ, తరువోజ మున్నగు పద్యము లుండినట్లు శాసనముల వలన స్పష్టముగా తెలియుచున్నది. అవిగాక పాల్కురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్రమున పేర్కొన్న తుమ్మెదపదములు, ప్రభాతపదములు, వెన్నెలపదములు, వాలేశుపదములు మున్నగు కొన్ని పదములు కూడ అప్పుడుండెనని యూహింపవచ్చును, కాని యివన్నియు దేశిపద్ధతికి చెందినవి. సంస్కృతాభిమానులైన పండితులు దేశికవిత్వము నంతగా ఆదరింపని కారణమున తరువాత మార్గకవితాపద్ధతియే క్రమముగా ప్రచారము పొందినది. క్రీ.శ. 1000 ప్రాంతమునకు చెందినదని ఊహింపబడు విరియాల కామసాని గూడూరు శాసనమున మొట్టమొదటిసారి మూడు చంపకమాలలును రెండు త్పలమాలలును కానవచ్చుచున్నవి. ఆటవెలది, తేటగీతి, మధ్యాక్కర సీసము అను వానిని విడువక సంస్కృతమునుండి కూడ శ్రవణపేయములైన పద్యములను గ్రహించి వానితో రసవత్తరము, కథాకమనీయమునైన మహాకావ్యమును మొదట రచించినవాడు నన్నయభట్టే. అందుచేతనే అతనికాదికవియను నామము సార్థకమైనది.

ఆ కాలమున భారతము వంటి మహాకావ్యమును రచింపఁబూనుట ప్రతిభైక సాధ్యమైన పని అప్పటికింకను తెలుగుభాషకు స్థిరమైన రూపమేర్పడియుండలేదు. అది ఒక్కొక్క ప్రాంతమున నొక్కొక్క విధముగా నుండెను. విభక్తి ప్రత్యయములు కాని క్రియారూపములు కాని అన్నియు గోచరింపవు అదిగాక మహాకావ్యము రచించుటకు తగినంత పదజాలము కూడా నందులేకుండెను. నన్నయ శాసనములందున్న భాషను, వ్యవహారము నందున్న భాషను పరిశీలించి, దానికి సౌష్ఠవోపేతమైన రూపము నొసంగి, సంస్కృతము నందలి పదములనన్నిటిని తెలుగున వాడుకొనుటకు తగిన ప్రణాళిక యేర్పఱిచి క్రొత్తవృత్తములను సంస్కృతము నుండి గ్రహించి కావ్యరచన ప్రారంభించెను. ఈ సందర్భమున కన్నడమున పంపమహాకవి అంతకు ముందే రచించిన విక్రమార్జున విజయమాతనికి మార్గదర్శకమై యుండును. అతడాంధ్రశబ్ద చింతామణిని రచించినను రచింపకపోయినను ఈవిధముగా ఆంధ్ర వాగనుశాసనుడు కూడ నయ్యెను. ఆంధ్రభాషాసాహిత్యములకు సుందరమైన రూపు దిద్దుటలో నన్నయ చూపిన ప్రతిభయు, పడినశ్రమయు అనన్యసాధ్యములై నట్టివి.

ప్రాఙ్నన్నయ యుగము నందలి తెలుగుభాష :

తెలుగుభాష క్రీస్తుపూర్వము రెండు మూడు శతాబ్దులనుండియు జనవ్యవహారమున నుండెనని ఊహించుట కాధారములున్నవి. అది ఆదిద్రావిడభాష నుండియు నితర ద్రావిడభాషల నుండియు విడివడి ప్రత్యేకరూపము నెప్పుడు పొందెనో చెప్పుట కాధారములు లేవు. బుద్ధఘోషుడు తాను వినయపిటకమునకు వ్రాసిన సమస్తపసాదిక అను వ్యాఖ్యలో అంతకు పూర్వమున్న వ్యాఖ్యలను కొన్నిటిని పేర్కొని యుండెను. వానిలో అంధక అట్టకథ అనునదొకటి దీనినశోకుని కుమారుడగు మహేంద్రుడు సింహళద్వీపమునకు కొనిపోయి అచ్చటి భాషలోని కనువదించెనని తెలియుచున్నది. అంధక అట్టకథకును ఆంధ్రభాషకును ఏమైన సంబంధమున్న అది క్రీ.పూ. మూడవ శతాబ్దికి పూర్వమే కొంత ప్రత్యేకపరిణామమును పొందెనని చెప్పవచ్చును. కాని ఆఅట్టకథ యిప్పుడు లభ్యము కాకపోవుటచే ఈవిషయమును నిశ్చయముగా చెప్పుట కవకాశము లేకున్నది.

భరతుడు నాట్యశాస్త్రమున రూపకములందేయే జాతుల పాత్రలేయేభాషల నుపయోగింపవలెనో చెప్పుచు

న బర్బర కిరాతాంధ్ర ద్రవిడాద్యాసు జాతిషు.
నాట్యప్రయోగే కర్తవ్యం కావ్యం (పాఠ్యం) భాషాసమాశ్రయమ్.
శౌరసేనీం సమాశ్రిత్య భాషా కార్యాతు నాటకే.

అని వ్రాసి యుండెను. అనగా బర్బర కిరాతాంధ్రద్రవిడాది జాతులందు నాట్యప్రయోగమున వారి భాషనుపయోగింపరాదనియు, ఆ భాషలకు బదులు శౌరసేని నుపయోగింపవలెననియు నతని భావము. భరతుడు క్రీ.పూ ప్రథమశతాబ్దిలో నివసించెనని పలువురు భావించుచున్నారు. పై శ్లోకమును బట్టి ఆంధ్ర ద్రవిడ జాతుల వలె తద్భాషలు కూడ భిన్నములై యుండెననియు తెలియుచున్నది. అతడు బర్బర కిరాతాంధ్ర భాషలను రూపకములందు నిషేధించుటకు అవి అప్పటికింకను సుస్వరూపము దాల్చియుండకపోవుటయే కారణమై యుండును. కాని అప్పటికాభాషలుండెనని ఊహించుటలో నాక్షేపముండదు. దీనిని బట్టి క్రీ. పూ. ప్రథమ శతాబ్ది నాటికి ఆంధ్రభాష జనవ్యవహారమున నేదోయొక రూపమున నుండెనని మాత్రము తలంపవచ్చును.

శాతవాహన రాజులలో నొకడైన హాలుడు తన కొలువునకు వచ్చి ప్రాకృత కవులు వినిపించిన రసవంతములైన గాథలలో నేడు వందల గాథలనేరి గాథాసప్తశతి అను నొక్క గ్రంథమును సంకలనము చేసెను. ఆ గాథలలో నచ్చటచ్చట కొన్ని తెలుగు పదములు కూడ కనబడుచున్నవి. అట్లు ప్రాకృత గాథలలో తెలుగు పదములు కొన్ని చొచ్చుటకప్పుడు తెలుగు వ్యవహారమున నుండి యుండుటయే కారణము. గాథాసప్తశతి యందు కానవచ్చు తెలుగు పదములలో అత్త, పాడి, పొట్ట, పిలు(పిల్ల), కరణి, ఫలహీ(ప్రత్తి), బోండీ(పంది), మోడి, కుడ (కుండ), దోరో (దారము) మున్నగునవి ముఖ్యములైనవి. హాలుడు క్రీ. శ. 19 నుండి 24 వరకును పరిపాలించియుండెనని చరిత్రజ్ఞులు చెప్పుచుండుటచే అప్పటికి తెలుగు భాష జనులలో బహుళ ప్రచారమునునుండెనని తలంపవచ్చును.

క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో గుణాఢ్యుడను కవి బృహత్కథ అనునొక పెద్ద కథా కావ్యమును రచించి యుండెను. దాని నతడు పైశాచీ భాషలో వ్రాసియుండెను. అందుకు కారణము కలదు. శర్వవర్మ అనునతడు కూడ అప్పుడు గుణాఢ్యునితో పాటు మరియొక మంత్రియై యుండెను. వారి ప్రభువైన శాతవాహన రాజు ఆఱు

మాసములలో సంస్కృత పండితుడను కావలెనని కోరగా గుణాఢ్యుడది అసంభవ మని తెలిపెను. శర్వవర్మ తానట్లు చేయగలనని రాజునకు విన్నవించెను. అప్పుడు గుణాఢ్యుడు అతడట్లు చేయగల్గినచో తాను సంస్కృతప్రాకృత దేశభాషలను పరిహరింతునని శపథము చేసెను.* తరువాత కుమారస్వామి అనుగ్రహముచే శర్వవర్మ రాజు నాఱునెలలలో సంస్కృత భాషాపండితుని గావించెను. అప్పుడు గుణాఢ్యుడు నగరమును విడిచి అడవికేగి పైశాచీ భాషల్లో బృహత్కథను రచించెను. మంత్రులకు జరిగిన ఈ వాగ్వివాద మిపుడు మహారాష్ట్ర దేశమునందున్న పైఠన్ నగరమున జరిగియుండెను. అప్పుడది ఆంధ్రసామ్రాజ్యమునకు ఒక ముఖ్య పట్టణముగ నుండెను. గుణాఢ్యుడు విడిచి పెట్టెదనని చెప్పిన దేశభాషయేదో నిర్ణయింపజాలము. కాని అప్పటి కింకను ఆధునికమైన మరాఠీ భాష యేర్పడి యుండని కారణమునను, తెలుగు రాజధానిలో ఆ వివాదము జరిగి యుండుట వలన, అది తెలుగే అయి యుండునని పలువురు అభిప్రాయపడుచున్నారు. ఈ విషయము కూడ క్రీ. శ. ప్రథమ శతాబ్ది నాటికి తెలుగు భాష జనవ్యవహారమున నుండెనని నిరూపించుచున్నది.

క్రీ. శ. ప్రథమ శతాబ్దినాటి అమరావతీ స్తూపమునందలి ఒక రాతి పలకమీద 'నాగబు' అను పదము వాక్యగతముగ కాక ప్రత్యేకముగ కనబడుచున్నది. ఇది నాగశబ్దము నుండి ఏర్పడిన తత్సమరూపము. దీని చివరనున్న 'బు' అను నక్షరము ఇది తెలుగుపదమని స్పష్టముగ తెలుపుచున్నది. ఈ బు వర్ణనమే క్రమముగ మ్బు, ంబు, మ్ము, ము. అను రూపములను పొంది తెలుగున అమహద్వాచక ప్రథమైక వచన ప్రత్యయముగ స్థిరపడినది. దీనిని బట్టి సంస్కృత పదములను తత్సమములుగ చేయునప్పుడిప్పటి ము వర్ణకమునకు పూర్వరూపమైన బు వర్ణమును వాని చివరచేర్చు నాచారమప్పటికే ఏర్పడెనని విశదమగుచున్నది.

శాతవాహనుల తరువాత చిన్న చిన్న భాగములుగా నేర్పడిన ఆంధ్ర రాజ్యమును ఇక్ష్వాకులు బృహత్పలాయనులు, శాలంకాయనులు, ఆనందగోత్రికులు, విష్ణుకుండినులు పల్లవులు, మున్నగు వారు పరిపాలించిరి. వారు తమ శాసనములను

---

* షడ్భిర్మాసైస్త్వయాదేవః శిక్షితశ్చేత్ త్వమయా, సంస్కృతం ప్రాకృతం తద్వద్దేశభాషా చ సర్వదా
భాషాత్రయ మిదం త్యక్తం యన్మనుష్యేషు సంభవేత్.

తెలుగుభాషలో కాక సంస్కృతమునందో ప్రాకృతమునందో వ్రాయించ యుండిరి. కాని వానిలో కనవచ్చు చిన్నపురి, కురువాడ, తెల్లవల్లి, రేగొండ, వేపూరు, చెఱ్ఱారువు మున్నగు గ్రామనామములును, ఊరు, కొన చెఱువు, కుదురు, రేవు, పాక, వాడ, ముడి, అను గ్రామనామముల చివరనుండు పదములును, గోలశర్మ, కొట్టిశర్మ, దొడ్డిస్వామి మున్నగు ప్రతిగ్రహీతలైన బ్రాహ్మణుల పేరులును, "ఱ" 'న్ట' అను వింత ధ్వనులును, కొన్ని గ్రామనామములందు కానవచ్చు తాలవ్యీకరణమును (చెఱ్ఱుఱువు), అనుస్వారమును వ్రాయు పద్ధతియు క్రీ. శ. మొదటి శతాబ్దముల యందలి తెలుగుభాష పరిణామ స్వరూపములను సూచించుచున్నది. క్రీస్తు శకారంభము నుండియు జన వ్యవహారమున నుండెననుటకు నిదర్శనములుగ నున్నవి. అదిగాక, రేగొండ, వేపూరు ఇర్చులి, ఒంగోడు, తాన్టికొన్ట, ముయ్యూర్ కూటువ మున్నగు రెండు, మూడు పదములతో కూడిన సమానములు కూడ అంతకు కొన్ని శతాబ్దులకు పూర్వమే తెలుగు జన వ్యవహారము నుండి క్రమముగ వికాసము పొందుచున్నదని తెల్పుచున్నవి.

విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళదాన శాసనములో (క్రీ. శ. ఆరవశతాబ్ది) విజయరాజ్యసంవత్సరంబుళ్ అను పదములు కనవచ్చుచున్నవి. ఆ శాసనమంతయు సంస్కృత భాషలో నున్నది. కాని తల్లేఖకుడు తెలుగు వాడగుటచే 'విజయరాజ్య సంవత్సరాః' అనుటకు బదులు తానెఱిగిన సంవత్సరంబుళ్ అను తెలుగు ప్రత్యయముతో కూడిన పదము వాడెను. తమిళ కన్నడములందలి కళ్ అను బహువచన ప్రత్యయము అనుచిత విభాగముచే 'ళ్'గా మాఱి క్రమముగ తెలుగున 'లు'గా స్థిరపడినది. వీరపురుషదత్తుని కాలమునకు చెందిన నాగార్జునకొండ శాసనములో మహాతలవరి, మహాతలవర అను బిరుదనామములు కనవచ్చుచున్నవి. ఇందలి తలవరి శబ్దమునకు తలారి అనునది రూపాంతరము. అట్లే జయవర్మ కొండముడిశాసనమునందు బాపహానవర్మకు మహాతగవర. మహాదండనాయక బిరుదములు కలవు. తగవు పదమునకు మతుబర్థమున అరి అను తద్ధితప్రత్యయమును చేర్చినచో తగవరి అనుశబ్దమేర్పడును. దీనికి న్యాయాధిపతి అని అర్థము. బిరుదములలో నచ్చటచ్చట నిట్టి మిశ్రసమానములు కనబడుచుండును. పైన పేర్కొనబడిన పరిస్థితులను బట్టి తెలుగు క్రీస్తు శకారంభము నుండియు జనవ్యవహారమున నుండెననుటకు వీలు కలుగుచున్నది

కాని అంతవఱకును తెలుగులో వ్రాయబడిన శాసనము కాని, గ్రంథము కాని, కనబడదు.

క్రీ. శ. 6 వ శతాబ్ది చరమపాదమునుండి తెలుగుభాషాపరిణామమున రెండవదశ ఆరంభమగును. అప్పుడు తెలుగు దేశము నందలి కొన్ని భాగములను పాలించిన రేనాటి చోళులను, తూర్పుచాళుక్యులను తమ శాసనములు కొన్నింటిని తెలుగు భాషయందే వెలయించిరి. రేనాటి చోళరాజైన ధనంజయుని కలమళ్ళ శాసనమును (575) మొదటి తెలుగు శాసనమని చెప్పవచ్చును. తరువాత క్రీ. శ. 7, 8 శతాబ్దులలో తూర్పు చాళుక్యులు వేయించిన శాసనములలో ప్రాకృత భాషా పదము లెక్కువగా కనిపించును. ఈ కాలపుశాసనములను గద్యశాసనములు, గద్యపద్యమయ శాసనములు, పద్యశాసనములు అని మూడు విధములుగా విభజింప వచ్చును. జయసింహ వల్లభుని విప్పర్లశాసనము (641) కపోతేశ్వర స్వామి ఆలయములోని చేజెర్ల శాసనము. లక్ష్మీపుర శాసనము (680) మూడవ విజయాదిత్యుని ధర్మవరము శాసనము (850) రేనాటి చోళులును బాణవైదుంబరాజులును వేయించిన శాసనములు గద్యశాసనములు. అహదనకర శాసనమున (740 అని కొందఱు 840 అని కొందఱు) మొదట కొంత సంస్కృతమును తరువాత కొంత తెలుగును కానవచ్చుచున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనముననైదు మధ్యాక్కరలున్నవి. ఆఱవ మధ్యాక్కరలోని మొదటి పంక్తి యేహేతువుచేతనో యందు నాలుగు గణములపై నొక అక్షరమును మాత్రము చెక్కి శాసన లేఖకుడు విడిచిపెట్టి యుండెను. నాల్గవ మధ్యాక్కర తరువాత కొంతగద్యమున్నది. అందుచే దీనిని గద్యపద్యమయ శాసనమనియే చెప్పవలయును. 848 నాటి అద్దంకి శాసనమున కూడ నిట్లేయొకతరువోజము పిమ్మట కొంత గద్యమును కానవచ్చు చున్నవి. చాళుక్య భీమ మహారాజు ధర్మవర శాసనములో మొదట కొంత గద్యమును తరువాత నొక సీసమును కలవు. గుణగవిజయాదిత్యుని కాలమునకు చెందిన కందుకూరుశాసనమున నొక సీసము కలదు. విరియాలకామసాని గూడూరు శాసనమున (1000) మూడుత్పలమాలలును రెండు చంపకమాలలును కలవు. ఇంతవఱకు లభించిన చాళుక్యశాసనములలో ఈ రెండే కేవలపద్యమయ శాసనములు. గద్యశాసనములలో కూడ నక్కడక్కడ వృత్తగంధివాక్యములు కొన్ని కనబడుచున్నవి.

సంస్కృత ప్రాకృత శాసనములకును తెలుగు శాసనములకును విషయమున నంత భేదము కనబడదు. అవియు నివియు దానములను వీరులపరాక్రమములను సూచించునట్టివే. దానశాసనములలో దాతృప్రతి గ్రహీతల పేర్లును, దత్తములగు గ్రామ క్షేత్రముల పేర్లును, వాని యెల్లలును చెప్పబడును. చివర దానము రక్షించిన వారికి పుణ్యమును వచ్చినవారికి పాపమును కలుగునను హెచ్చరికయు పిమ్మట నాజ్ఞప్తి కర్తృలేఖకుల పేర్లును సూచింపబడును. ఈ శాసనములు పెక్కు విషయ ప్రధానములగుటచే వీనియందు సారస్వత గుణమంతగా కనిపింపదు. కరుణ వీర రసచ్ఛాయలు మాత్రము కొన్నిచోట్ల గోచరించును.

క్రీ. శ. 7, 8 శతాబ్దులలోని తెలుగు భాషా శాసనములలో ప్రాకృత భాషా సంసర్గ ప్రభావములు హెచ్చుగా కనవచ్చుచున్నవి. ఇవి రేనాటి చోళుల శాసనములలో కంటె తూర్పుచాళుక్యుల శాసనములలోనే హెచ్చు. ప్రాకృత పద బాహుళ్యము చేతను, దేశ్యపదములింకను నన్నయ భారతమున స్థిరపడి మనకు సుపరిచితములైన రూపములను బొంది యుండకపోవుటచేతను ఆ శాసనములు కొంతవఱకు దుర్బోధములుగా నుండును. పూణ్ణమ, బారణాసి (విపర్తిశాన). దొగ, ప్రతమ, బోళ (లక్ష్మీపుర), సర్వబాద పరియాదువు, సవ్వలోకశ్రయ మహాసత్తువళ్ (అహదనకర) దుజయరాజుల, దుకరాజులు, పన్నస (ఎఱ్ఱగుడిపాడుశాస) ఆణతి (రామేశ్వర స్తంభ శాస) వణం (చిలంకూరు) అణపోతులు (పొట్లమాలె) మున్నగు పదములాశాసనములఁగల ప్రాకృత భాషా సంసర్గమునకుఁ దార్కాణములు. రేవణకాలు, కుణ్డికాళ్ళు, నివబుకాను, రట్టకుట్ట, తారుముష్ణి, పాకాతుఱాన, అచ్చువాన్డు, పులొంబున, మట్ఱు, ఇఱ్ఱకాను, ఆడ్లుపట్టు, పఱాను, రెఢ్ణునడల, వసిణ్ణిముడ్లు మున్నగు పదములు తెలుగుపదములేయైనను బరిచితములైన రూపములతోనుండక పోవుటచే మన కన్యదేశ్యముల వలెనే క్రొత్తగా గానవచ్చు చున్నవి. అహదనకర శాసనములో నిట్టి పదముల సంఖ్య హెచ్చుగా నున్నది. ల, నలను, ళఱలుగా వ్రాయుటయు (కళరేని, బణిసేసిన, ళేదు, మనమిప్పుడు సర్వలు సాధారణముగా వాడుచుండు లు అను బహువచన ప్రత్యయమే ళు, ళ్, కళ్, గళ్, కొళు, కొల్ మున్నగు భిన్నరూపములతోఁగానవచ్చుటయు, మనకా భాష కొంత వింతగా దోచుటకు గారణ మగుచున్నది.

కాలము గడచిన కొలంది ప్రాకృతభాషాసంసర్గప్రభావములు తగ్గ సంస్కృత భాషా ప్రభావ మధికమగుట కానవచ్చును. ఈ శాసనములలో దీర్ఘ

సంస్కృత సమానములను తత్సమపదములును విరివిగా నుపయోగింపబడి యున్నవి. చాళుక్య భీముని కొఱవి శాసనమునందలి శైలి (900) సరిగా నన్నయ భారతమునందలిశైలిని బోలియున్నది. ఈ శాసనములలో నచ్చటచ్చట భూతతద్ధర్మములందలి క్రియలు కానవచ్చును. కాని సమాపకక్రియలు లేని వాక్యముల సంఖ్యయే హెచ్చు. రూప వైవిధ్యముగల పదములు పెక్కు కనిపించును (పాఱుడు, పాఱళ్ళ, పొఱ, పాఱాను). శసలు, తదలు తారుమాఱుగా వ్రాయ బడుచుండును. (ఇసానశివులు, వేగిదేసము, సక్తి, వశున్ధరా, శాక్షితేని, దేనికి) వర్గయుక్కులకు బదులు వర్గ ప్రథమ తృతీయాక్షరములు గోచరించును (స్తితి, ప్రతమ, అస్వమేదంబు, ఇష్టవిషయ) దీర్ఘాచ్చులు హ్రిస్వములుగాను హ్రిస్వములు దీర్ఘములుగాను కనబడును. (సత్యదిత్యున్ఱు, మహారాజులాకున్, పడుమాఱికోట, వేపురాను) సంస్కృతాద్యార్య భాషలందు కానరాక ద్రావిడభాషలకు మాత్రము విలక్షణమైన ఱ అను వింత అక్షర మీ పూర్వశాసనములలో కొన్నిచోట్ల కనబడును. తెలుగులో నిప్పడర్ధానుస్వార పూర్ణానుస్వారములు రెండును కలవు. అర్ధానుస్వారము మఱేయితర ద్రావిడభాషలయందునులేదు. తమిళముననుస్వారమునకు బదులు వర్గపంచమాక్షరమునే వ్రాయుచుందురు. ఈ యాచారము తెలుగున కూడ ప్రాచీన శాసనములలో కన(బడుచున్నది. కొన్నిచోట్ల పూర్వాక్షరముపై చుక్కరూపమున వ్రాయు సంస్కృతపద్ధతికూడ కలదు. దీనినిబట్టి అనుస్వారమును వ్రాయు విధాన మప్పటికింకను స్థిరత్వము పొందలేదని భావింపవచ్చును. నన్నయ తరువాత క్రమముగా వర్గపంచమాక్షర ప్రయోగము తగ్గిపోవుటచే బిందువు వాడుక అధికమైనది. కొన్నిచోట్ల అర్ధానుస్వారమునకును పూర్ణానుస్వారమునకును భేదము సూచించుటకై పూర్ణానుస్వారము తరువాత హల్లును ద్విత్వయుక్తముగా వ్రాసెడి వారు. (సంయ్యుక్తున్టు, బెడంగ్గరాజు, త్రికలింగ్గాటవి) ప్రభుం బండరంగుం బఞ్చిన అను అద్దంకి శాసనమునందలి భాగమును ప్రభు(బండరంగు( బఞ్చిన అని గ్రహింపవలయును. పద్యశాసనములలో ప్రథమావిభక్తిము ప్రత్యయము బిందు పూర్వకబువర్ణముగా వ్రాయ(బడిన కొన్నిచోట్ల యథాస్థితముగా గురు లఘు నిర్దేశము చేసిచూచిన గణభంగము చేకూరును. (బలగర్వం బొప్పగ=బలగర్వమొప్పగ).

చాళుక్యయుగము నందలి శాసనములలో సాధురేఫ సంశ్లిష్టములైన యక్షరము లను వ్రాయుపద్ధతి కూడ ద్వైవిధ్యమును దాల్చియున్నది. సంయుక్తాక్షరములలో

పూర్వాంగమును రకారముగా వ్రాసి దాని క్రింద మఱొక హల్లుచిహ్నమును వ్రాయుట యొకపద్ధతి ఉత్తరాంశమైన హల్లును ద్విత్వరూపమున వ్రాసి దాని ప్రక్క వలపలిగిలుకనుంచుట రెండవ పద్ధతి. కాలక్రమమున హల్లునుద్విత్వముగా వ్రాయుట మాని అద్విరుక్తమైన హల్లు ప్రక్కనే వలపలిగిలుక వ్రాయుపద్ధతి యేర్పడినది. ఈ రెండు పద్ధతులును శాసనములలో కనిపించినను రెండవ దానికే ప్రాచుర్యము హెచ్చు. (మాసపూర్ణ్ణమి; శర్మ్మ; నర్కుపు; తర్క్క; ప్రవర్ద్ధమాన; దుర్గ్గంబు; ఆ చంద్రార్కస్థాయి).

కాలు, కాళ్ళు అను పదములు పూజ్యార్థమున వాడఁబడుచుండెను. (రేవణకాలు, పుద్ధణకాలు). గారు అనుపదము కూడ అరుదుగా కనబడుచున్నది. కళ్ అను ద్రావిడ బహువచన ప్రత్యయము తెలుగున ళ్, ళు అను రూపములుగామాఱి క్రీ. శ. 9 వ శతాబ్దినాటికి లు అను రూపముగా స్థిరపడినది. ద్రావిడ భాషా పదములలో తొలుదొల్త లింగభేదములేనట్లే కనఁబడును. అర్థమునుబట్టియే అందు లింగమును నిర్ణయించుకొనవలయును. సంస్కృతప్రభావముచే తరువాత ద్రావిడభాషలలో కూడ లింగభేదము సూచించుటకు ప్రయత్నములు చేయఁబడెను. చాళుక్యయుగము నందలి శాసనములలో మొదట న్ఱు తో కూడిన రూపములును, మధ్యకాలమున (8, 9 శతాబ్దులు) ణ్డు తో కూడిన రూపములును, అంత్యకాలమున (10, 11 శతాబ్దులు) ణ్డు, ండు, ఁడులతో కూడిన రూపములును కనవచ్చుచున్నవి. ప్రథమావిభక్తివలెనే మిగిలిన విభక్తులు కూడ సంస్కృతసామ్యముచే తెలుగున నన్నయకు పూర్వమే స్థిరపడి పోయినవి. కూర్చి, గుఱించి, కొఱకు, కంటె, యొక్క మున్నగు విభక్తి ప్రత్యయములు మాత్రము నన్నయకు పూర్వపు శాసనములలో కానరావు. తోడ, వలన, లోపల, అందు, మున్నగునవి మొదట ప్రత్యేకపదములేయైనను కాలక్రమమున పదత్వమును గోల్పోయి ప్రత్యయములుగా స్థిరపడినవి.

చాళుక్య యుగము నందలి శాసనములలో దాత ప్రతిగ్రహీత, దానము అను మూడు విషయములే ప్రాధాన్యము వహించియుండును. అందాజ్ఞా భాగము సాధారణ ముగా సంస్కృతభాషలో నుండుటచే నుత్తమ మధ్యమపురుష శబ్దములందే యుండుట సంభవించును. అందుచే మధ్య మోత్తమ పురుషములందలి తెలుఁగుసర్వనామములు శాసనములలో ఁగాంచుట కవకాశము లేదు. ప్రథమపురుష సర్వనామములు మాత్ర మచ్చటచ్చట గోచరించుచుండును. క్రియలలో కూడ శాసనములలో మధ్య

మోత్తమ పురుషరూపముల కంతగా నావశ్యకముండదు. వాఱు, వానిచే, వారికి; వాన్తు, కొట్టె, పడియెన్, కావిఞ్చె, చూపె, కాచె, చొచ్చె మున్నగునవి. ప్రథమపురుష మందలి రూపములకు నిదర్శనములు. ఒక్క చాళుక్యభీముని కొఱవిశాసనమున మాత్రము ప్రత్యక్షవాక్యప్రయోగముండుటచే మధ్యమోత్తమ పురుషములకు సంబంధించిన కొన్ని సర్వనామరూపములు కనవచ్చుచున్నవి. (నీవు, నీచేసిన, నీకేమి, నాకెల్ల) ఆత్మార్థక సర్వనామమున కేకవచనమున తాను, బహువచనమున తాము, వారు అను రూపములు కనబడుచున్నవి.

చాళుక్య యుగము నందలి శాసనములలో పెక్కు సంఖ్యావాచక రూపములు గోచరించుచున్నవి. ఇవి యితర దాక్షిణాత్య భాషలందలి సంఖ్యావాచకములతో సన్నిహిత సంబంధమును సూచించుచు వాని చరిత్ర పరిణామముల నన్వేషించువారి కెన్నో విధముల తోడ్పడుచున్నవి. ఒణ్డు, ఒకొొటి, ఒక్కటి, రెణ్డు, ఇరు, మూండు. పణ్డ్రెండు, మూన్తు- నాల్కు, నాల్గాఱు, నాలుగు,ఏను, ఏబది, ఎఱు, ఎఱుంబొది, ఎణ్మతొంబ, నూటానల్వొది, పరేణ్డంబు, ముప్పది, ఏనూఱు. వేయుగవిళాలు, వేవురు మున్నగునవి దృష్టాంతములు.

ఈ శాసనములలో ఉత్తునకు పెక్కుచోట్ల సంధియగు చున్నట్లును, అత్తునకు వైకల్పికముగా నగుచున్నట్లును, ఇత్తునకు సంధిలేనట్లును తెలియుచున్నది. సంధిలేని చోట్ల కొన్నియెడల యడాగమము చేయఁబడినది. షష్టీవిభక్తి ప్రత్యయములైన కికు అనునవి ద్రుతాంతములుగా ప్రయోగింపఁబడినవి. వీనికచ్చు పరమైనపుడు సంధియైన రూపములును, ద్రుతములోపింపగా విసంధి పాటింపఁబడిన రూపములును కనవచ్చుచున్నవి. కాని ద్రుతముతో పరాచ్చు కలసిన రూపము వెచ్చటను కనరావు. ఈశాసనములలో కొన్నిచోట్ల పరుషములకు సరళాదేశము కానరాదు; కొన్ని చోట్ల సరళాదేశమున్నను బిందువులోపించుచున్నది. వీనిలో కకారమునకు వైకల్పికముగను మిగిలిన పరుషములకు నియతముగను గసడదవాదేశము గోచరించుచున్నది. పద్య శాసనములలో నీ యాదేశము నిత్యగానున్నది.

పెక్కు వాక్యములలో సమాపకక్రియలు లేనేలేవు, అట్టిచోట్ల భూతతద్ధర్మ క్రియాజన్య విశేషణములతో, గూడిన విశేష్యములతోడనో, తచ్ఛబ్దానుప్రయోగముతో గూడిన భూతతద్ధర్మ విశేషణములతోడనో అర్థము వ్యక్తముచేయఁబడు చుండును. కొన్ని చోట్ల క్రియాజన్య విశేషణములు లేకుండ కూడ సందర్భమును

బట్టియే అర్థమ్మూస్యూచిత మగుచున్నది. ఎఱిగల్ తుగరాజుజ్ఞ ఇచ్చినవన్నన, పళకు పోవు పన్నాః, చేగొణ్ణ వాన్లు, విచ్చిన వాన్లు, చెడినవాన్లు. అనునవి ఉదాహరణములు, సాధారణముగా వాక్యములందు పదములు కర్త, కర్మ, క్రియ అను వరుసలో కనవచ్చును. విశేషణములు విశేష్యములకు వెనుకను, అవ్యయములు క్రియలకు వెనుకను వాడఁబడుచుండును. ఈక్రమమున కపవాదములు కూడ కలవు. పద్యములలో కర్తృ కర్మ క్రియల క్రమము గణానుసారముగా మాఱుచుండును. కొన్ని శాసనములలో రాజుల బిరుదావళులు దీర్ఘసమాసఘటితములై యున్నవి. అక్కడక్కడ రెండు మూడు పదములతో గూడిన తెనుగు సమాసములు కూడ నున్నవి. (మాఱుస్త పిడుకు (గు), ముయ్యలికుట్టు, పేదరియాకుజిస్త, అరివరజముస్థు) కొన్ని శాసనములలో తెలుగువాక్యములందు సుబాద్యంతములైన సంస్కృత పదములే వాడబడనవి. ఇట్టి శైలికే మణిప్రవాళ శైలియనిపేరు. (వాచ్చో తాళకొడుకు పల్లవాచార్యస్య లికితం) కొన్ని శాసనములలో ఎల్లలు తెలుగునను. దిక్కులు సంస్కృతమునను వ్రాయఁబడినవి. పూర్వస్యాందిశి త్రికోణ మడువుసీమా దక్షిణతః మగ్గాణ్డు.

నన్నయకు పూర్వము శాసనములేకాక, కొందఱు కవులు కావ్యములు కూడ రచించిరనియు, అందలి పద్యములు ప్రబంధరత్నావళిలో నుదాహరింపఁబడినవనియు కొందఱు విమర్శకులు తెల్పియున్నారు. అట్టికవులలో పద్మకవి, గజాంకుశ క్షేమేంద్రభోజరాజులు, సర్వదేవకవి మున్నగువారు ముఖ్యులు క్రీ.శ. 11వ శతాబ్దిలో రచింపఁబడిన యాప్పిరంగలం అను తమిళ ఛ్ఛందోగ్రంథములో వాంఛయ్య వ్రాసినతెలుగు ఛందము పేర్కొనఁబడినది. ఈ వాంఛయ్యయే రేచయ్య అయియుండుననియు, అతడే కవిజనాశ్రయము రచించిన రేచన కావచ్చుననియు కొందఱి అభిప్రాయము. అప్పటికే తెలుగుననొక ఛందోగ్రంథము రచింపఁబడుట యంతకు పూర్వమే ఆ భాషలో ఛందోబద్ధమైనరచన విరివిగానుండెనని తెల్పుచున్నది. కాని ఆ రచనలు లబ్ధముకాకపోవుటచేతను, మత హేతువులచే నందలి విశేషభాగము నశింపఁజేయఁబడుటచేతను తద్గుణదోషములను పరిశీలించి చెప్పుటకవకాశము లేక పోవుచున్నది. తననాటికివిధముగా రూపవైవిధ్యముతో కూడినట్టియు, అసమగ్రమైనట్టియు భాషను పరిష్కరించి, సంస్కృత పదములను తెలుగున వాడుటకు తగిన ప్రణాళికనేర్పఱచి, మహాకావ్యరచనార్హమైన భాషను రూపొందించి, శ్రావ్యములైన సంస్కృత వృత్తము లను దేశివృత్తములతో జతచేసి నన్నయ మహాభారతరచనమునకు శ్రీకారము చుట్టెను.

## 2. సంస్కృతభారతము-నన్నయ్య జీవితవిశేషములు

భారతీయ సంస్కృతికి మూలకందములు వేదములు. అందైహికాముష్మిక జ్ఞానమునకు సంబంధించిన విషయములనేకము లున్నవి. వేద శబ్దము విద్-జ్ఞానే అను ధాతువు నుండి యేర్పడినది. వేదము లతి ప్రాచీనము లగుటచే నందలి భాష గూడ ప్రాచీనముగానే యుండును. అది అర్థముగాని పరిస్థితి యేర్పడినప్పుడు మహర్షు లందలి ధర్మ తత్త్వ నీతి విషయములను, సామాన్య ప్రజలకుఁగూడ నందఁజేయు టకై కథోపాఖ్యానములతో గూడిన రామాయణము, భారతము పురాణేతిహాసములు మున్నగు గ్రంథములను వ్రాయ దొడంగిరి. ఆద్యమయిన లౌకికసంస్కృతవాఙ్మయ మంతయు వేదార్థోపబృంహణ ప్రయోజనమునకై వెలువడినదనియే చెప్ప వచ్చును. అట్టి గ్రంథములలో కృష్ణద్వైపాయన విరచితమయిన మహాభారతము ప్రధానమయినది. సర్వవర్ణాశ్రమములకుఁజెందిన మానవుల కనుసరణీయములైన ధర్మనీతితత్త్వములన్నియు నందు కథోపాఖ్యానముల ద్వారా వివరింపఁబడి యున్నవి. "యదత్రాస్తి తదన్యత్ర, యన్నేహాస్తి న తత్క్వచి"త్తని వ్యాసుడు చెప్పిన వాక్యమునందతిశయోక్తి యిసుమంతయు లేదు. ఈ విషయమునే నన్నయ్య ఆది పర్వావతారికలో "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ తత్త్వంబని, యధ్యాత్మవిదులు వేదాంత మనియు" అను సీస పద్యమున వివరించియున్నాఁడు. భారతవంశ రాజుల చరిత్రను చెప్పునదగుటచేతను, మహత్త్వభారోపత్తముల కాకరమగుటచేతను దానికి మహభారత మను పేరు సార్థకమైనది. ఉపనిషత్సారభూతమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్ర ములైన భగవద్గీత, యందలి యొక భాగమగుట దాని మహత్తమునకు హేతువగుట యేకాక దానికి పంచమవేదమను పేరు కూడా కలిగించినది. మహాభారతము విషయ గౌరవమును బట్టి సర్వభారతీయ భాషలలోనికిని, పెక్కు పాశ్చాత్య భాష లలోనికిని కూడా ననువదింపఁబడినది. దానిని తెలుగున రచించనారంభించినవాడు నన్నయ్యభట్టు. అతడాది సభాపర్వములను అరణ్యపర్వమున మూడాశ్వాసములపై 142 పద్యములను రచించి నన్నయ్య దివంగతుడు కాగా తరువాత తిక్కన సోమ యాజి విరాటపర్వము మొదలుగా పదునైదు పర్వములను, ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్య పర్వ శేషమును నన్నయ అడుగుజాడలనే అనుసరించి రచించి ఆంధ్రమున పంచమ వేదమును సమగ్రము కావించిరి. ఈ ముగ్గురు కవులను సాధారణముగా కవిత్రయము వారను పేరుతో పిల్చుచుందురు. ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమునకా ముగ్గురును

త్రిమూర్తులవంటి వారు. తరువాత ఆంధ్రకవులందరును వారిని గురు ప్రాయులుగా భావించి స్తుతించిరి.

నన్నయ జన్మదేశములనుగూర్చి నిశ్చయముగా చెప్పుటకు తగిన యాధారము లేవియును లేవు. అతడాదిపర్వారంభమందలి యవతారికలో తన్నుగూర్చి వ్రాసి కొన్న "తనకుల బ్రాహ్మణు" నిత్యాదిగాఁగల సీస పద్యమును బట్టి యాతని విద్యా పాండితీప్రతిభలను గూర్చి యించుక తెలిసికొనవచ్చును. కాని దాని వలన నీతని చరిత్ర మేమియు వ్యక్తమగుట లేదు. అతడు రాజరాజునకు కులబ్రాహ్మణుడనియు, ననురక్తుడనియు, నవిరళజపహోమతత్పరుడనియు, విపుల శబ్దశాసనుడనియు, సంహితాభ్యాసుడనియు, బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాననిరతుడనియు, నాప స్తంబ సూత్రుడనియు, ముద్గల గోత్రజాతుడనియు, లోకజ్ఞుడనియు, నుభయ భాషా కావ్య రచనాభిశోభితుడనియు, నిత్యసత్య వచనుడనియు, మత్యమరాధిపాచార్యు డనియు, పాత్రుడనియు, నవదాత చరిత్రుడనియు నది తెలుపుచున్నది. రాజరాజ నరేంద్రునికాలమునందలి నందంపూడి మండ శాసనకావ్యముల కర్త నన్నయభట్టే యనుటకు సందేహములేదు. ఆ శాసనములయందు "కావ్యానాం కర్తా నన్నయ భట్టః" అని యుండుటచేతను, నన్నియ అను శబ్దము కన్నడ శబ్దము వలె కనుపించుట చేతను నతడు కన్నడ దేశీయుడై యుండునని కొందరు తలంచిరి. కాని యది నమంజసము గాదు. శ్రీ చాగంటి శేషయ్యగారు నన్నయ మహారాష్ట్ర బ్రాహ్మణుడని చెప్పువారివాదములను ఖండించి యతడు శుద్ధాంధ్ర బ్రాహ్మణుడని నిరూపించి యున్నారు. పట్టమట్టి సరస్వతీ సోమయాజి తన వృధుచరిత్ర కావ్యమున "నన్నయ భట్టుగారు యజనం బొనరించిన చోట జమ్మి చెట్టున్నది తణుకు తూర్పున సమున్నత మైనది" యని వ్రాసి యుండెను. ఈ తణుకు ప్రస్తుతము పశ్చిమ గోదావరి మండల మున నున్నది. సరస్వతీ సోమయాజి తప్ప మరెవ్వరును నన్నయ యజ్ఞ మొనరించె నని కాని సోమయాజి యని కాని చెప్పియుండ లేదు. పై సీసము నందలి యవిరళ జప హోమతత్పరుడను విశేషణ మతడు కర్మిష్ఠుడని సూచించుచున్నది. కాని యజ్ఞము కావించెనని తెల్పుట లేదు. నన్నయ జననకాలము వలెనే యతని మరణ కాలముగూడ మనకు తెలియదు. రాజరాజ నరేంద్రుని తర్వాత నతడు కొంతకాలము జీవించి యుండినచో తణుకు ప్రాంతమున కేగి దానికి తూర్పున యజ్ఞము గావించి యుండెనని యూహింపవచ్చును. ఈ యూహకు సరస్వతీ సోమయాజి వ్రాత తప్ప మతే యాధారమును లేదు.

కులబ్రాహ్మణ శబ్దమును గూర్చి పండితులలో పెక్కు వాదములు జరిగి యున్నవి. "కులవిప్రః పురోహితః"యని వాచస్పత్యమున నుండుటచే కులవిప్ర కుల బ్రాహ్మణ శబ్దములకు గల సాదృశ్యమును బట్టి యతడు పురోహితుడనియు, నందుచే వైదికుడై యుండుననియు కొందఱు భావించిరి. చాళుక్య రాజ్యాంగమునఁగల పంచ ప్రధానులలో పురోహితుడొకడు. అపుడు పురోహితత్వము గూడ ప్రధానత్వముతో తుల్యమయి గౌరవాస్పదముగనే యుండెను. ఆ శబ్దమును బట్టి నన్నయ యిప్పటి పురోహితులవంటి వాడని తలంపరాదు. కీ.శే. బుర్రా శేషగిరిరావు పంతులుగారు పురోహితలకు బ్రాహ్మణ శబ్దములు భిన్నములనియు, శాసనకర్తలు సంధి విగ్రహులు. మహామంత్రులు, మున్నగువారికి కులబ్రాహ్మణ శబ్దము వాడబడుచుండెననియు, నన్నయ్య గూడ నందంపూడి మండ శాసనములకు కర్తయగుటచే కులబ్రాహ్మణుడని పిలువబడుచుండెననియు సూచించి యుండిరి. రాజరాజు తాతయైన అమ్మరాజ రాజమహేంద్రుని ఒక శాసనములో "మత్కులబ్రాహ్మణాయ" యనుప్రయోగము గానవచ్చుచున్నది. ఆ శాసనము సమగ్రముగా లభింపనికారణమున నందు కులబ్రా హ్మణ శబ్దమే యర్థమున వాడబడినదో నిర్ణయింపఁజాలము. ఆ శబ్దమునకు పిత్ర పితామహక్రమమున వచ్చిన బ్రాహ్మణుడయిన మంత్రి యనునర్థము చెప్పుట సమం జసము. ఆరోజులలో బ్రాహ్మణులందు వైదిక నియోగి భేదములుండెనో లేదో చెప్పుట కాధారములు లేవు. నామాంతశబ్దములను బట్టి వైదికనియోగిత్వములను నిర్ణయింప వచ్చునని కొందఱు తలంతురుగాని యొకే కుటుంబమునందలి వ్యక్తులచే యీరెండు శబ్దములును వాడబడియున్నవి. నన్నయభట్టు సహాధ్యాయుడైన నారాయణభట్టు తండ్రి శంకనామాత్యుడని చెప్పబడుటయే యిందుకు నిదర్శనము, అందుచే భట్ట శబ్దమునకు వైదికుడని కాక వేదవేదాంగ విదుడగు విప్రుడని చెప్పుటయుచితముగా నుండును.

రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుడు వేయించిన రణస్థిపూడి శాస నమునకు కావ్యకర్త భీమనభట్టు, రాజరాజు కాలమునందలి కోరుమిల్లి కలిదిండి శాస నముల కావ్యకర్త భీమనభట్టు కుమారుడైన బేతనభట్టు (చెట్టునభట్టుని కొందరు) సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు పండ్రెండవ విజయ రాజ్య సంవత్స రము నందలి (1072) శిలాశాసనము భీమన ప్రగడలు మార్కండేశ్వర మహా దేవరకు అఖండవర్తి దివ్వియ పెట్టించినట్లు చెప్పుచున్నది. ఈ విష్ణువర్ధన మహా రాజు రాజరాజునవతితమ్ముడైన విజయాదిత్యుడే భీమనప్రగ్గడ యాతనికడ నమాత్యుడై యుండును. పైనపేర్కొనబడిన భీమనభట్టాదులెల్లరును చాళుక్యరాజుల కులబ్రాహ్మణులేయై యుందురనియు, బేతనభట్టును, నన్నయభట్టు భీమనభట్టు కుమా

రులై యుండురనియు, నన్నయ తనకుమారునికి భీమనయని తాత పేరు పెట్టియుండు ననియు శ్రీచాగంటి శేషయ్యగారు అభిప్రాయపడుచున్నారు. ఇది యుక్తియుక్తముగానే యున్నది, కాని భీమనభట్టు నన్నయభట్టులకును, నన్నయ భట్టు భీమన ప్రగ్గడలకును పితాపుత్ర సంబంధము నిశ్చయించుటకు పదవి కాలక్రమములు తప్ప నాధారాంతరములు కనవచ్చుట లేదు. వారు చెప్పినది నిజమైనచో నన్నయ భీమనభట్టు కుమారుడని భావింపవచ్చును. అతని తల్లిపేరు తెలియదు. భీమనప్రగ్గడయను నామము నందలి ప్రగ్గడపదముబట్టి యతడు నియోగియై యుండుననియు, నందుచేనతని తండ్రియైన నన్నయ గూడ నియోగియే అయి యుండుననియు, శ్రీశేషయ్య గారు మరియొక ప్రతిపాదనము గూడ గావించియున్నారు. అసలు నన్నయ్యకును భీమన ప్రగ్గడకునుగల పితాపుత్ర సంబంధమే సందిగ్ధమైయుండుట చేతను, ఆకాలమున వైదిక నియోగి శాఖాభేదము లుండెనో లేవో చెప్పుట కాధారములు లేకుండుటచేతను ఆయన యభిప్రాయమును విశ్వసించుటకు వీలులేదు. భీమనప్రగ్గడనామము నందలి ప్రగ్గడ శబ్దము మంత్రిత్వ సూచకమేగాని శాఖాసూచకముగాదు.

రాజరాజు తండ్రియైన విమలాదిత్యుడు 1019లో మరణించెను కాని, తరువాత మూడు సంవత్సరముల వరకును రాజరాజుపట్టాభిషిక్తుగుటకు అవకాశము లేకపోయెను. అతని సవతితమ్ముడైన విజయాదిత్యుడు తండ్రి మరణించిన యప్పుడే కాక తరువాత నవకాశము చిక్కినప్పుడెల్ల సింహాసనము నాక్రమించుటకు యత్నించుచునేయుండెను. అప్పుడు రాజరాజు మాతామహస్థానమయిన చోళరాజ్యమునకేగి తాతయొక్కయు మామయొక్కయు సాహాయ్యమును పొంది రాజ్యము నిలబెట్టుకొనుచుండెను. విజయాదిత్యునికి పశ్చిమ చాళుక్యుల సాహాయ్యము లభించుచుండెను. ఈ విధముగా 1050 సం॥ ప్రాంతమున రాజరాజు పశ్చిమ చాళుక్యులతో సంధి చేసికొనునంతవఱకును రాజ్యమునఁగాని, అతని మనస్సునగాని ప్రశాంతిలేకుండెను. తరువాతనే సహజముగా కావ్యగీతీ ప్రియుడయిన యాతడు నన్నయభట్టును భారతమును తెలుగున వ్రాయుమని కోరుటయు అతడు వ్రాయనారంభించుటయు జరిగియుండును. పశ్చిమ చాళుక్యులతో సంధిచేసికొను సందర్భమున రాజరాజునకు నన్నయద్వారా అతని సహాధ్యాయుడును, పశ్చిమచాళుక్యుల మంత్రియునైన నారాయణభట్టు తోడ్పాటు లభించియుండును. నన్నయ అరణ్యపర్వమున మూడాశ్వాసములపై 142 పద్యములను మాత్రమే రచించి రచన నాపివేయుటకు యథార్థమైన కారణమేమో తెలియదు. అందుకు రాజరాజు మరణించిన పిమ్మట రాజకీయముగాఁగలిగిన మార్పు

లచే పోషించు ప్రభువు లేకుండుట యొకకారణమై యుండునని యూహింపవచ్చును. అట్లే కొందఱు తలంచునట్లు అరణ్యపర్వ దుష్ప్రభావముచేఁగాని ప్రబలమైన రోగముచేఁగాని మతిభ్రమించుటచేనతఁడు రచనాకార్యము నాపివేసి యుండ వచ్చును. కాని తాళప్రతులన్నిటిలో అరణ్యపర్వ తృతీయాశ్వాసమునందలి 142 వ పద్యము తరువాత ఎఱ్ఱాప్రెగడ కవిత్వము నారంభమని యుండుటచే నావిషయము శంకింప నవకాశము లేదు, నన్నయ తరువాత నెంతకాలము జీవించెనో తెలియదు. నన్నయయు రాజరాజును సమవయస్కులును మిత్రులును నయియుండుటచే రాజరాజువలె నన్నయయు 1000 వ సంవత్సరము ప్రాంతమున జన్మించి సుమారఱువదియేండ్లు (1060-61 వఱకు) జీవించియుండునని తలపవచ్చును. కొందఱు రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడైన స్వల్పకాలమునకే నన్నయ భారత రచన కారంభించి 1030 ప్రాంతమున మరణించి యుండునని చెప్పుచున్నారు. అప్పుడు నన్నయ రాజరాజుకంటే వయస్సున పెద్దవాడని చెప్పవలయును కాని అప్పటి రాజకీయ కల్లోలముచే నన్నయ భారతరచన కారంభించుట కవకాశము లేకుండెననియు, 1050 తరువాతనే అనగా రాజ్యమున శాంతి పరిస్థితులేర్పడిన పిమ్మటనే నన్నయయాఘనకార్యమున కుపక్రమించెననియు తలంచుటయే యుచిత తరముగా నుండును.

నన్నయ యితరరచనలు :

నన్నయ భారతమునందలి రెండున్నరపర్వములనేకాక చౌడేశ్వరీవిలాసమను నామాంతరముగల చాముండికావిలాసమును, ఆంధ్రశబ్దచింతామణియను సంస్కృతార్యా శ్లోకములతో కూడిన ఆంధ్రవ్యాకరణమును, ఇంద్రవిజయ రాఘవాభ్యుదయ ములను కావ్యములను, లక్షణసారమను లక్షణ గ్రంథమును కూడ రచించెనని లోక ప్రతీతి కలదు. వీనిలో ఇంద్రవిజయ రాఘవాభ్యుదయములు లభించుటలేదు. అందలి పద్యములు కొన్నియైన నెచ్చటను ఉదహరింపఁబడి యుండలేదు. కస్తూరిరంగకవి ఆనందరాట్ఛందమున లక్షణసారము నందలివని కొన్ని పద్యము లుదాహరింపఁబడి యున్నవి. ఇతరులెవ్వరు వాని నుదాహరించి యుండలేదు. అదిగాక యందు నన్నయ తరువాతివాడైన అధర్వణాచార్యులవారి పేరు కలదట. అందుచేత అసలాగ్రంథ మున్నదని కాని దానిని నన్నయ రచించెనని కాని చెప్పుటకవకాశములేదు. చౌడేశ్వరీవిలాస మున మూడాశ్వాసములుగా విభజింపఁబడిన 120 పద్యము లున్నవి. అందు

ప్రథమాశ్వాసము నందవరీక బ్రాహ్మణులనుగూర్చియు, ద్వితీయతృతీయాశ్వాసములు తొగట కులమువారని చెప్పఁబడు దేవాంగులగూర్చియు వివరించుచున్నవి. గ్రంథారంభమునందలి "ఘనత రాజేంద్రుని కరుణవడసినట్టివాఁడను నన్నయ భట్టు నేను" అను సీసపాదమునుబట్టి తద్రచయిత రాజరాజనరేంద్రుని దయపొందినట్టి నన్నయభట్టేయని చెప్పవచ్చును. కాని పద్యరచనా విధానమును, వస్తుస్వభావమును, సీసములందలి యతినియమమును అది నన్నయ రచనకాదని నిశ్చయముగా తెల్పుచున్నవి. పైగా నన్నయనాడు నందవరీకులను బ్రాహ్మణులుండిరో లేదో తెలియదు. ఈ గ్రంథమునందలి మూడాశ్వాసముల చివరనున్న నన్నయవిశేషణములతో కూడిన మూడు గద్యలును మూడు విధములుగానున్నవి. ఇదికూడ నీ గ్రంథము నన్నయకర్తృకమగునా కాదా యను సందేహమునకు తావొసంగుచున్నది.

ఆంధ్రశబ్దచింతామణి కర్తృత్వవిషయము కూడ నిర్వివాదముగాలేదు. కొందఱు దానిని నన్నయయే రచించెననియు మఱికొందఱెవ్వరో రచించి నన్నయ పేర ప్రకటించిరనియు చెప్పుచున్నారు. ఉభయపక్షములవారు సూచించు నుపపత్తులును బలవత్తరములుగనే యున్నవి. కాని యిటీవల పలువురది నన్నయ కర్తృకము కాదనియే నిశ్చయించియున్నారు. అందుకు వారు చూపు హేతువులివి.

1. క్రీ. శ. 16, 17 శతాబ్దులకు చెందిన బాలసరస్వతి దానికిటీక వ్రాయువఱకు దానినెవ్వరును పేర్కొని యుండలేదు. 2. బాలసరస్వతి పెక్కు సంవత్సరములు మఱుగుపడియున్న ఆ గ్రంథమును తన యిష్టదైవమగు విరూపాక్షుడు తన కిచ్చిటీకవ్రాయుమని కోరెనని చెప్పుటయు, రాజరాజనరేంద్రుని కుమారుడగు సారంగధరుడు నన్నయ రచించినప్పుడు బాల్యమున తాను దానిని పఠించి కాలు సేతులు ఖండింపఁబడిన పిమ్మట సిద్ధుడై మతంగ పర్వతము చెంత బాలసరస్వతి కిచ్చెననియు, తన కిష్టదైవమగు గోపాలదేవుడు స్వప్నమున సాక్షాత్కరించి "మతంగ పర్వత విప్రునివలన ఆంధ్రశబ్ద చింతామణి నీ యింటికి వచ్చును. దానిని నీవాంధ్రీకరించి లోకోపకార మొనరింపు"మని చెప్పి అదృశ్యుడు కాగా మఱునాడే మతంగ పర్వతవిప్రుడు వచ్చి తనకాగ్రంథము నిచ్చెనని అప్పకవి వ్రాయుటయు కల్పిత కథలవలె నున్నవికాని విశ్వసనీయములుగా లేవు. 3. కేతన ఆంధ్రశబ్ద చింతామణిని పేర్కొనకపోవుటయేకాక "మున్ను తెనుఁగునకు లక్షణమెన్నడు నెవ్వరు చెప్పరే జెప్పెద"నని తన ఆంధ్రభాషాభూషణమునకు ముందు తెలుగునకు వ్యాకరణము

లేదని వ్యక్తము చేసియుండెను. 4. నుష్మ్యోత్తోహ్యాథర్వణాచార్యమతాత్, కవిభల్లపైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే" అను సూత్రములలో ఆథర్వణాచార్య కవిభల్లటులు పేర్కొనఁబడి యున్నారు. వీరిరువురును నన్నయకు తరువాతివారే. 5. అదికాక చింతామణియందలి 'కేచిత్, విదుః, అన్యవ్యాకరణ' మున్నగు పదము లంతకుముందే తెలుగుననేవో కొన్ని వ్యాకరణములుండెనని సూచించుచున్నవి. 6. 'నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః' (ఉత్తమ పురుషమునందు కాక యితర పురుషములందలి క్రియలందిత్తునకు సంధి నిత్యము) అను సూత్రమునకు భిన్నముగా నన్నయ భారతమునందు ప్రథమ పురుషేకార్థమునకు సంధివైకల్పికముగా పాటింపఁబడినది. అట్లే నన్నయ భారతమునందలి యితర ప్రయోగములను పెక్కింటిని చింతామణి ననుసరించి సాధించుటకు వీలులేకున్నది. నన్నయ భారతములోకాని, తత్కాల శాసనములలోకాని చింతామణి అంగీకరించిన ప్రయోగములు కనబడుటలేదు. ఇందుకు చింతామణి అంగీకరించిన పదాది యకారము నన్నయభారతమందెచ్చటను లేకుండుట యొక నిదర్శనము. అట్లే చింతామణి చెప్పిన కూర్చి, గురించి, పట్టి, యొక్క మున్నగు విభక్తి ప్రత్యయములను కూడ నన్నయ వాడియుండలేదు. వర్తమానార్థమునను, భవిష్యదర్థమునను వరుసగా చింతామణియందు విధించఁబడిన ఉన్నకలానుబంధములు [1]నన్నయ భారతమున మృగ్యములు. 7. చింతామణి రచనవలననే నన్నయకు వాగనుశాసనుడను బిరుదు వచ్చినదని కొందఱి అభిప్రాయము. కాని భారతరచనకు పూర్వమాంధ్రభాషకు స్థిరసుందరమైన రూపమును తీర్చిదిద్దియుండుటవలననే ఆతనికాబిరుదము కలిగెననుట సమంజసము. జక్కన విక్రమార్కచరిత్రమున "పలువురు పెద్దలు సత్ప్రబంధములు చెప్పిరికాని నన్నయవలె శబ్దశాసనవరేణ్యులని ప్రసిద్ధిపొందిరా"యని కావ్యరచన చేతనే ఆతనికా ప్రశస్తి వచ్చినదని చెప్పియుండెను.

ఈ హేతువులచే నన్నయ ఆంధ్రశబ్దచింతామణిని రచించియుండలేదనుటయే యుక్తముగానుండును. అందుచే ఆతడు భారతభాగమును, కొన్ని శాసనకావ్యములను మాత్రమే రచించియుండెననియు, ఆతడు కృత్యంతరములేవైన వ్రాసియుండినచో నవి లభ్యములగుటలేదనియు భావింపవచ్చును.

---

[1] "వసతిరనుబంధకస్స్యాద్యత్ర లతర్థోభవిషత్వస్తత్ర, అస్తి దనుబంధతా స్స్యాద్యత్ర ల్నదర్థో వివక్షితోధాతోః"

# 3.- ఆన్ధ్ర భారతమునందలి అవతారిక

ఆదిపర్వారంభమునందలి మంగళాశాసనమును నన్నయ సంస్కృతశ్లోక రూపమున రచించెను. "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపితన్ముఖ"మ్మని లాక్షణికులు కావ్యారంభపద్యము ఆశీర్నమస్క్రియాత్మకముగనో, వస్తునిర్దేశాత్మకముగనో యుండవలెనని సూచించిరి. ఆశీర్వాదము సంస్కృతభాషలో నుండిన ఎక్కువ ఫల వంతమగునని ఇప్పటివారుకూడ భావించుచుండ నన్నయ నాడట్టి భావము మరెంత యధికముగనుండి యుండుననుటలో నాశ్చర్యము లేదు. అందుచే నన్నయ దానిని "శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతోవక్షోముఖాంగేషు" ఇత్యాదిగా సంస్కృతమున రచించియుండెను. ఇదియొక విధముగ సంస్కృతనాటకారంభమునందలి నాంది శ్లోకమును పోలియున్నది. నాందీశ్లోకమును సూత్రధారుడు ప్రయోగించును. ఈ శ్లోకము భారతాంధ్రీకరణనాటకమునకు సూత్రధారుడగు రాజరాజనరేంద్రుడు చెప్పినట్లుగానున్నది. అసలీఅవతారికయంతయు ఇతర గ్రంథములలో వలె ఉత్తమ పురుషములో కాక ప్రథమ పురుషములోనున్నది. అవతారికయందు తన ప్రసక్తి ఎక్కువగా వచ్చుటకవకాశము కలదు. కావున అవికత్థనుడగు నన్నయ దానిని ప్రథమ పురుషములో రచించి యుండును. ఇట్లే పోతరాజాదులు కూడ "ఇమ్మను జేశ్వరాధములకిచ్చి" మున్నగు స్వవిషయనిర్దేశకములగు పద్యములను ప్రథమపురుషములోనే రచించియుండిరి. ఈయవతారికను నన్నయ కాక ఎవరో రచించియుందురని అభిప్రాయపడువారు కూడ కొందరు కలరు. కాని ఆయభిప్రాయము అంగీకార్యము కాదు.

శ్రీవాణీగిరిజలను చిరకాలము వరుసగా వక్షోముఖాంగములయందు ధరించి స్త్రీపుంసయోగాత్మకమైన లోకముల స్థితి నావహించువారును, వేదత్రయమూర్తులును దేవపూజితులునగు పురుషోత్తమాంబుజభవ శ్రీకంఠులు మీకు శ్రేయస్సు కలిగింతురు కాక అనునది ఈ ఆరంభశ్లోకమునందలి భావము. ఇది ఆశీర్వాదరూపమున నున్నది. పురుషోత్తముడు శ్రీకృష్ణుడు - భారతమున నాతడు నిర్వహించినపాత్ర మిక్కిలి ప్రముఖమైనది. ధర్మరాజాదులును, భీష్మద్రోణాదులును పురుషోత్తములే. వారి వృత్తాంతము కూడ భారతమునందాద్యంతము కానవచ్చును. భారతమునకు పంచమ వేదమని పేరు. అందుచే పురుషోత్తమ, వేదత్రయమూర్తులను శబ్దములు భారతవస్తు నిర్దేశకములుగనున్నవని చెప్పవచ్చును. కొందరు విమర్శకులు బ్రహ్మవిష్ణుమహే

శ్వరులను త్రిమూర్తులు లోకసృష్టిస్థితిలయములను నిర్వహించుచున్నట్లు త్రిమూర్తుల వంటి కవిత్రయమువారు విస్తృతప్రపంచమువంటి మహాభారతము నిర్వహింతురను భావ్యర్థముకూడ నీశ్లోకమున నిమిడియున్నదని చెప్పుచున్నారు. ఋషితుల్యుడయిన నన్నయ నోటివెంట అట్టి భావ్యర్థసూచకమైన వాక్కువచ్చుటలో వింతలేదు. ఏ కారణముచేతనైననేమి భారతమును నన్నయయు, తిక్కనయు, ఎఱ్ఱనయు రచించుట జరిగినది. నన్నయశబ్దము నారాయణశబ్దభవమనియు, తిక్కన కవిబ్రహ్మయనియు, ఎఱ్ఱన శంభుదాసుడనియు భావించునప్పుడీయర్థము సమంజసముగనే యుండును. దీని కూహతప్ప మఱి ఏ ఆధారమును లేదు.

మంగళాశాసనమయిన పిమ్మట అవతారికలో రాజరాజనరేంద్రుని గుణగణములును, నన్నయ పాండితీవైభవమును, భారతమహత్త్వమును, రాజరాజు నన్నయను భారతము వ్రాయుమనికోరువృత్తాంతమును, నారాయణభట్టుతోడ్పడగా నన్నయభారతమును రచించనారంభించిన విషయమును, నన్నయ కవిత్వమునందలి ప్రధానగుణములును వర్ణింపబడియున్నవి. ఇందలి పద్యములు ధారాశుద్ధియందును, అర్థగాంభీర్యమునందును, యథార్థకథనమునందును, అక్షరరమ్యతయందును. అనన్యసామాన్యములై అలరారుచున్నవి. ఆరంభపద్యములు రాజరాజనరేంద్రుని కీర్తికాంతిరూపాభిజాత్యములను, ధర్మమార్గతత్పరతను, దానదయావిలాసములను, వర్ణాశ్రమధర్మబ్రాహ్మణజనరక్షణపరాయణత్వమును, విద్యావివేకములను, భారతశ్రవణాసక్తిని వెల్లడించుచున్నవి. రాజరాజు త్రిమూర్తులయు, వారి పత్నులయు, అనుగ్రహముచే సంపాదింపబడి నిత్యప్రవర్ధమానమగు మహీరాజ్యవైభవముకలవాడు; భుజపరాక్రమ విజితవైరిరాజనివహుడు. నిఖిలజగజ్జేగీయమాన నానాగుణరత్నరత్నాకరుడు. విశుద్ధయశశ్శరదిందుచంద్రికారాజితసర్వలోకుడు, విమలాదిత్యునికుమారుడు, వివిధాగమములయందు పరిశ్రమచేసినవాడు, కాంతియందు చంద్రునివంటివాడు, కళంకరహితమైన చరిత్ర కలవాడు, తనరాజ్యమునందలిప్రజలను ప్రీతితో పెంచుచు; పరమండలరాజులనోడించి కప్పములగ్రహించుచు, ఈయనిరాకరించువారి ఉక్కడగించుచు, సర్వదిక్కుల తన యాజ్ఞవెలయించుచు, శరణాగతులైనవారిని రక్షించుచు, బ్రాహ్మణులకగ్రహారముల నొసంగుచు, దేవభోగములను యథావిధిగాకొనసాగించుచు, అతడు మనుమార్గుడై సంచరించుచుండెను. అతడు పురాణములన్నియు వినెను. అర్థధర్మశాస్త్రముల తెలిసెంగెఱింగెను. కావ్యనాటకక్రమములు పెక్కుచూచెను. జగత్పరిపూజ్యములైన శైవాగమముల

యందు భక్తితో హృదయమునిల్పెను. అతనికి బ్రాహ్మణకులాభితర్పణమునందును, భారతశ్రవణమునందును, శివపదాబ్జధ్యానపూజలయందును, సంతతదానాచరణము నందును, సాధుసాంగత్యమునందును ప్రీతిహెచ్చు. నన్నయ రాజరాజుకుమారవిద్యాధరుడని వర్ణించెను. విద్యాధరులు దేవయోనివిశేషములు గంధర్వులవంటివారు. అందుచే నిది కుమారగంధర్వునివలె బిరుదనామమైయుండవచ్చును. కుమారస్వామిఅస్త్రవిద్యానిపుణుడు. దేవసేనాని. అందుచే కుమారవిద్యాధరుడనగా అస్త్రవిద్యానిపుణుడని కూడ చెప్పవచ్చును. చాళుక్యులు కుమారస్వామి భక్తులు. అందుచే కుమారస్వామికి సంబంధించిన తత్త్వవిద్యయందు నిష్ణాతుడనికూడ దీనికర్థము భావింపవచ్చును. ఈ విధముగా నీపద్యములందు రాజరాజు గుణగణములన్నియు విశదముగా వర్ణింపబడి యున్నవి.

రాజరాజు విద్యావిలాసగోష్ఠి సలుపుచు ఇష్టకథా వినోదతత్పరుడై యుండిన సభ వచనమున వర్ణింపబడినది. రాజరాజు సకలభువనలక్ష్మీవిలాసనివాసమైన రమ్యహర్మ్యతలమున కొలువు తీర్చియుండెను. అప్పుడు మంత్రులు, పురోహితులు, సేనాపతులు, దండనాయకులు, దౌవారికులు, మహాప్రధానులు, సామంతులు విలాసినీజనులు అతనిని పరివేష్టించియుండి. ఆ సభయందు అపారశబ్దశాస్త్రపారీణులైన వైయాకరణులును, భారతరామాయణములందును, బహుపురాణములందును ప్రవీణులైనపౌరాణికులును మృదుమధుర రసభావభాసుర నవార్థవచన రచనా విశారదులైన మహాకవులును, తర్కశాస్త్ర పాండిత్యముచే సమస్త శాస్త్రసాగరముల నాపోశనము పట్టిన తార్కికులును ఉండిరి. ఇందు పేర్కొనబడిన మహాకవులు సంస్కృత కవులై యుందురు. నన్నయకు పూర్వమందలి శాసనములలో తెలుగు పద్యములను వ్రాసిన తెలుగుకవులు కూడ కొందరు కలరు. కోరుమిల్లి శాసనమున బేతనభట్టు రగడ వ్రాసియుండెను. నారాయణభట్టు సంస్కృత ప్రాకృతములందేగాక ఆంధ్ర కర్ణాటకభాషలందు కూడ మహాకవియై యుండినట్లు నన్నయ నందంపూడి శాసనమున వర్ణించియుండెను. అందుచే దేశభాషా మహాకావ్య రచనా సందర్భమున సమావిష్టమైన ఆసభలో దేశభాషాకవులు కూడ కొందరుండిరని యూహింపవచ్చును. నన్నయ రాజరాజుఉదాత్త రసాన్విత కావ్యనాటకక్రమములు పెక్కు చూచియుండినట్లు వర్ణించెను. బహుశః ఈ కావ్యనాటకములు కూడ సంస్కృత భాషకు కూడ సంబంధించినవే అయి యుండును. సంస్కృతమునందలి సుప్రసిద్ధ కావ్యనాటకములన్నియు అంతకు ముందు వెలిసినట్టివే. కన్నడమున రత్నత్రయ

రచితములయిన గ్రంథములుకూడ నాటికి సుప్రసిద్ధములై యుండుటచే అతడు వానిని కూడ పఠించియో వినియో యుండవచ్చును. ఆంధ్రమున నప్పటికి కవిత్వ ముండెను గాని ఉదాత్తరసాన్వితములైన కావ్యములుండెనని చెప్పజాలము. పాల్కురికి సోమనాథుడు శివరాత్రి జాగరమున బహువిధములైన వేడ్కలు, ప్రదర్శనములు జరుగుచుండెనని చెప్పి "ప్రమథ పురాతనపటుచరిత్రములు - క్రమమొంద బహునాటకములాడువారు - - - వెండియు భవుబహువిధచరిత్రములఖండితగతి నాటకములాడుచు" అని వర్ణించియుండెను. అవి యక్షగానములవంటి దేశీయ నాటకములై యుండవచ్చును. రాజరాజట్టి నాటకములను ప్రదర్శనములను కూడ చూచి యుండవచ్చును.

పురాణములు పదునెన్మిది యుండగా రాజరాజు మహాభారతమునే తెనుగున వ్రాయింపదలంచుటకు కొన్ని ప్రత్యేక కారణములున్నవి. అతని "కనవరతంబును శ్రీమహాభారతమునందలి యభిప్రాయంబు పెద్దయైయుండును." భారతము పంచమవేదము. ఇందున్నది మఱెచ్చటనైననుండవచ్చును. ఇందులేనిది మఱెచ్చటనుండదు. అనగానిది సర్వసనాతనధర్మసంస్కృతి సంప్రదాయములకును నిధానము. పురాణములు పాక్షికములైనవి. ప్రత్యేక దైవతపరముగా రచింపబడినవి. అందుచే ఒక్కొక్క పురాణము శైవులకో, వైష్ణవులకో, శాక్తేయులకో ప్రీతికరముగా నుండవచ్చును. కాని భారతమువలె సర్వజన ప్రీతి సంధాయకము కాజాలదు. రాజరాజు చంద్రవంశమునకు చెందినవాడు. భారతము చంద్రునిదొట్టి పూరువు, భరతుడు, కురువు, పాండురాజు మున్నగువారు క్రమముగా వంశకర్తలైన చంద్రవంశమునపుట్టి విమల సద్గుణశోభితులైన పాండవోత్తముల చరిత్రకు పట్టుగొమ్మ అందుచే దానిని వినవలెనను. కుతూహలము రాజరాజునకధికముగా నుండుట సహజము. భారతమప్పటికే బహుభాషలలో బహువిధములుగా రచింపబడియుండెను. పంపకవి దానిని కన్నడమునను (విక్రమార్జునవిజయము) పెరుందేవనారు తమిళమున వెంబా పద్యములలోను వ్రాసియుండిరి. వానిని చూచిన రాజరాజునకు తెలుగులో కూడ దానిని వెలయింపవలెనను అభిలాష పొడమియుండును. భారతమహత్త్వమమేయము. దానిని వినుచు తత్బద్ధస్పృహులగువానికి బహుయాగములోనరించిన పుణ్యము చేకూరును. అంతేకాక భారతశ్రవణాసక్తిచే "అమల సువర్ణశృంగఖురమై కపిలంబగుగోశతంబు నుత్తమ బహువేదవిప్రులకు దానము చేసిన ఫలము" తప్పక కలుగును. ఇన్ని కారణములచే రాజరాజు భారతమును తెనుగున వ్రాయించుటకు పూనుకొనెను.

అదికాక రాజరాజు వైదికమతాభిమాని. ఆ కాలమున జైన బౌద్ధాదులు దేశభాషలు నేర్చుకొని ఆయా భాషలలో సామాన్యజనులకు తమ తమ మతముల ఔత్కృష్ట్యమునుగూర్చి ప్రసంగించుచు వారిని స్వమతావలంబులుగా నొనరించుటకై యత్నించుచుండిరనుట కాధారములు కలవు. సంస్కృతమున వ్యాసరచిత భారతముండినను సామాన్యజనులకు తద్భాషాపరిజ్ఞానము లేనికతమున వారితర మతముల ప్రభావమునకు లోనగుటకవకాశమున్నది. దాని నరికట్టుటకై కూడ రాజరాజు భారతమును తెనుగున రచింపఁజేయుటకు పూనియుండవచ్చును. ఆ కార్యమును సర్వసమర్థతతో నిర్వహించుటకు తన కులబ్రాహ్మణుడు, మిత్రుడును, మహాపండితుడును, ఉభయభాషాకావ్య రచనాభిశోభితుడునైన నన్నయయే అర్హుడని తలంచి అతడు

కం. జననుత కృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్.

అని అతనిని కోరెను. వ్యాసమహాముని మహాభారతమందు నిబంధించిన అర్థము తేటతెల్లమగునట్లుగా అధికధీసంపదతో భారతమును తెనుగున రచింపుమని దీనియర్థము. ఈ పద్యమునందు నిగూఢమైన భావము కలదని కొందరు విమర్శకులు భావించుచున్నారు. రాజరాజు కన్నడమున పంపకవి రచించిన విక్రమార్జున విజయమును పఠించియుండెను. అతడు వ్యాసభారతమునుండియే కథను గ్రహించినను తనరచనలో జైనమత సంప్రదాయములను కొన్నిటినిమిడ్చెను. అతడందు కృష్ణుని భగవత్త్వము మఱుగుపఱచెను. కృతిపతికిని అర్జునునకును కొన్నిచోట్ల అభేదాధ్యవసాయము పాటించుటయేకాక అర్జునుడొక్కడే ద్రౌపదిని వివాహమాడినట్లు వర్ణించెను. మఱియు కొన్ని వర్ణనములయందు, ముఖ్యముగా సన్యాసుల వర్ణనలయందు, జైన సంప్రదాయముల ననుసరించెను. వైదికమతాభిమానియగు రాజరాజునకట్టి మార్పులు సమ్మతములై యుండవు. అందుచేనతడు ప్రత్యేకముగ "కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడునట్లుగా" భారతమును రచింపుమని నన్నయను హెచ్చరించియుండునని వారి యభిప్రాయము. నన్నయ పంపనివలె స్వాతంత్ర్యము వహింపక వ్యాసమహాముని అభిప్రాయమునే అనుసరింపవలెనని

హృచ్ఛరికయందలి నిగూఢాశయము. రాజరాజట్లెందుకు చెప్పెనో మనకు తెలియదు కాని ఈపద్యమునందట్టి ధ్వని యున్నదనుటలో సందేహములేదు. అదికాక రాజరాజు నన్నయను భారతమును తెనుగునరచింపుమని కోరెనేకాని, మక్కికి మక్కిగా అనువదింపుమని కోరియుండలేదు. నన్నయయు అట్లే కావించియుండెను.

రాజరాజు తన్నట్లుకోరగనే నన్నయ అంగీకారమును సూచించియుండలేదు. అతడు

"అమలిన తారకా సముదయంబులనెన్నను సర్వవేదశా
స్త్రములయశేషసారము ముదంబున బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారత భారతీ సము
ద్రముఁదఱియంగనీదను విధాతృనకైనను నేరఁబోలునే.

అయినను దేవా నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునం జేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెదన"ని పల్కెను. ఆకాశమునందలి నక్షత్రముల నెన్నుటవలె, సర్వవేదశాస్త్రముల సారమునంతను గ్రహించుటవలె, బుద్ధియనెడు బాహు విక్రమమున దుర్గమమైన యర్థమనెడి జలముగల భారతమందలి వాక్కనెడి సముద్రము పారము ముట్ట నీదుట బ్రహ్మకైన శక్యముకాదనియు అయినను ప్రభువైన రాజరాజు ఆజ్ఞాపించుటచే విద్వజ్జనులయనుగ్రహము పొంది తానునేర్చిన విధమున భారతకావ్యము రచించెదననియు నన్నయ చెప్పెను. ఆ రోజులలో భారతమువంటి మహాగ్రంథమును తెలుగున రచించుట సులభసాధ్యముకాదు. ఏలయన అప్పుడు తెలుగున మహాకావ్యరచనకావశ్యకమైన పదసంపదకాని, ఛందోవిస్తృతికాని లేకుండెను. దానిని రచింపఁబూనువాడు సంస్కృతమునందియో ఇతర భాషల నుండియో వానిని సమకూర్చుకొనవలయును. మఱియునది ఒక్కడు చేయదగిన కార్యముకాదు. అందుకు పలువురు విద్వాంసుల యనుగ్రహము కావలయును. ఈ విషయమునే నన్నయ రాజరాజుకు తెలియఁజెప్పెను. అతడు నానేర్చు విధంబున ననుటలో అతని వినయసంపద గోచరించుచున్నది. దీనిని చూచియేకాబోలు తిక్కన సోమయాజియు "నానేర్చిన భంగిచెప్పి వరుణీయుడు నయ్యెదభక్తకోటికి" అని విరాట పర్వారంభమున చెప్పియుండెను. నన్నయ ఇక్కావ్యంబు రచియించెదననుటలోకూడ గంభీరమైన యర్థమున్నది. సంస్కృత మహాభారతము మహేతిహాసము. కథాకథన వర్ణన రసపోషణాదులచే నా యితిహాసమును మహాకావ్యముగా నన్నయ రూపొందింపఁ దలచెనని దీనివలన తెలియుచున్నది.

తరువాతి పద్యమున నన్నయ హరిహరబ్రహ్మలను గణపతిని, సూర్యుని, కుమారస్వామిని, లక్ష్మీసరస్వతీ పార్వత్యాదులగు దేవతలను నుతించి, తపోవైభవ సంపన్నుడును సంస్కృతమున పద్యవిద్యకు నాద్యుడును బ్రహ్మసమానుడును అగు వాల్మీకిని స్మరించెను. పిమ్మట భారత భారతీకిరణ సముదాయములచే సంసారవికార మను అంధకారమును తొలగించి పండితహృదయాబ్జములను వికసింపఁజేయుట యందాసక్తుడును, మునిపూజితుడును, విశాలయశోవిరాజితుడునగు వ్యాసుడను సూర్యుని తలంచెను. తిక్కనసోమయాజి రచనలలో కనిపింపకపోయినను తరువాతి కవుల రచనలలో పెక్కింటిలో గ్రంథారంభమున త్రిమూర్తులయు వారి దేవేరులయు, గణపతియొక్కయు పూర్వసంస్కృతాంధ్ర కవివర్యులయొక్కయు స్తుతికనిపించును. నన్నయ ఈ పద్యములలో కావించిన తన్నామస్మరణమే అందుకు బీజమని చెప్పవచ్చును. పలువురుకవులు తమ కావ్యారంభములందు, సూర్యుని, కుమార స్వామిని తలంచియుండలేదు. బహుశః నన్నయ్య చాళుక్యులు కుమారస్వామి భక్తులగుటచే షడాస్యుని, "ఆరోగ్యంభాస్కరాదిచ్ఛేత్" అను సూక్తి ననుసరించి సూర్యుని స్మరించియుండును. అతడు సంస్కృతకవులలో ఆద్యులైన వాల్మీకి వ్యాసులను మాత్రమే కొలిచియుండెను. కాని ఇతర కవుల స్మరించి యుండలేదు. కాళిదాసాదులు అతనికి పూజనీయులే. కాని తాను రచించునదిభారత మగుటచే వ్యాసుని, తెనుగున తనవలె సంస్కృతమున నాదికవియైన వాల్మీకిని మాత్రమే అతడుస్మరించి యుండెను. దేశ భాషాకవులలో నప్పటికతనికి స్మరణార్హులైనవారెవ్వరును లేకపోయి యుండవచ్చును. ఒకవేళ నెవ్వరైన నుండినచో తరువాత నతడు గావించిన సభాస్తుతి యందే వారిస్తుతియు నంతర్గతమైయుండును. తెలుగురచన చేయుచు కన్నడ తమిళములందలి కవులను స్మరింపవలసిన యక్కర అతనికి తోచియుండదు.

నన్నయ తరువాత 'సత్సభాంతర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి' యుండెను. ఆ రోజులలో కవుల రచనలందలి గుణదోషములను పరిశీలించుటకు పండితపరిషత్తులుండి యుండవచ్చును. అట్టి పరిషత్తులను నెలకొల్పు సంప్రదాయము దక్షిణదేశమున చిరకాలమునుండియు నున్నట్లు కనిపించును. ప్రాచీనకాలమున తమిళదేశమునందాయా కాలములలో నాయాచోట్ల నెలకొల్పఁబడిన మూడు సంఘ ములను గూర్చి నక్కీరల్ అగప్పొరల్‌కు వ్రాసిన వ్యాఖ్యలో పేర్కొనియున్నాడు. మఱియు శాతవాహనుల కాలమునుండియు నాంధ్రదేశమున బౌద్ధమతము ప్రచారము

పొందియుండెను. ఆ మతమున బుద్ధ ధర్మములకు వలెనే సంఘమునకును అధిక ప్రాధాన్యమున్నది. దాని ననుసరించికూడ నన్నయ తన కావ్యారంభమున సత్సభాంతరములను కొనియాడియుండవచ్చును. రాజరాజు తన కాలమునందలి విద్వత్కవుల నందఱినిజేర్చి ఒక పండితపరిషత్తు స్థాపించి యుండవచ్చును. అట్టి సభలలో నన్నయ కూడ సభ్యుడో అధ్యక్షుడో అయి యుండుట నిర్వివాదాంశము. నన్నయ పండితసభలను స్తుతించిన పద్యము ఆ సభల స్వరూపమును, అందలి సభ్యుల పాండితీ ప్రాభవమును, అతనికి వానియెడఁగల గౌరవమును సూచించుచున్నది. పర్వసంగ్రహము చెప్పునప్పుడు వచనముల యనంతరముగల పద్యములలో "సకల సూరిసభారమ్యంబగు తృతీయపర్వము, సభారంజనమై సర్వమనోజ్ఞము నాలగు పర్వము, ద్రోణపర్వమమరున్ సభలన్, స్త్రీ పర్వంబు పదునొకండగు పర్వము నావెలయు సుకవి పండిత సభలన్, వివిధ బుధశ్రేణీ నుతంబై యానుశాసనిక పర్వమిలన్, ఆశ్వమేధిక పర్వమత్యంత నిబిడవస్తు విస్తారమై బుధవరుల సభల" అని పండిత సభలను పేర్కొనుట ఈ విషయమును బలపఱచు చున్నది,

తరువాత పాయక పాకశాసనికి అను పద్యమున నతడు సహాధ్యాయుడును, వాఙ్మయధురంధరుడును అయిన నారాయణభట్టు భారత సంగ్రామమున అర్జునునకు నారాయణునివలె తనకొనర్చిన సాహాయ్యమును కృతజ్ఞతా పూర్వకముగా కొనియాడి యుండెను. ఈ పద్యమునుగూర్చి పండితులలో వివిధములైన యభిప్రాయములున్నవి. ఇది అసలు నన్నయ వ్రాసియే ఉండలేదనియు, నారాయణశబ్దమునందలి ఉభయ యతియోగ్యతను సమర్థించుటకై అప్పకవియే దీనిని రచించియుండెననియు కొందఱి అభిప్రాయము. నారాయణ భట్టుకూడ భారతమున కొంతభాగము వ్రాసియుండగా దానిని మఱుగుపుచ్చి అసూయాగ్రస్తుడైన నన్నయ అతడు చేసిన సాహాయ్యమునిందు అస్పష్టముగ సూచించెననియు, పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నారాయణునట్లు అను ఉపమానమున వ్యంగ్యార్థముగలదనియు కొందఱి యభిప్రాయము. అర్జునుడును దుర్యోధనుడును, సాహాయ్యార్థులై వెళ్ళినప్పుడు కృష్ణుడు గోపాలసైన్యమును రెండు విభాగములుగాజేసి అందు తానొక్కడొకభాగమనియు, తాన్నాయుధము పట్టుటయు, అని చేయుటయు జరుగదనియు, పదివేల నారాయణాభిధానులతోకూడిన భాగము యుద్ధముచేయుననియు, అర్జునుడు చిన్నవాడగుటచే ముందు కోరుకొనుననియు చెప్పియుండెను. నిజమునకు భీష్మపర్వమున తప్ప మఱి ఎప్పుడును కృష్ణుడు యుద్ధము చేయుటకై చక్రము పట్టియుండలేదు. అప్పుడు కూడ

అర్జునుని ప్రార్థనముచే నాతడాగిపోయెను. అనగా అతడర్జునునకాయా సందర్భము లందు వాక్సాహాయ్యమును మాత్రమే చేసియుండెను కాని, యుద్ధాచరణరూపమైన సాహాయ్యమొనర్చియుండలేదు. అట్లే నారాయణభట్టు కూడ తన కప్పుడప్పుడేదో వాక్సాహాయ్యమును మాత్రమే చేసెనుకాని భారతమున ఒక్క పద్యముకూడ రచించి యుండలేదని నన్నయ వ్యంగ్యముగా చెప్పెనని ఆ విమర్శకుల యభిప్రాయము. కాని యీయూహలన్నియు నిరాధారములు. నిత్యసత్యవచనుడు, సుజనుడునైన నన్నయ నసూయాగ్రస్తుడనుట పాపమునకొడిగట్టుటయగును. నిజముగా నసూయాగ్రస్తుడై యుండినచో అసలు నారాయణభట్టుపేరెత్తకయే యుండెడివాడు. మరియునాతడీ పద్యమునందు నారాయణభట్టు తనకు సహాధ్యాయుడును ఇష్టుడునని ఎంతో ప్రీతిపూర్వకముగా చెప్పియుండెను. అంతేకాక రాజరాజు నారాయణభట్టునకు నందంపూడి అగ్రహారముగా నిచ్చినట్లు తెల్పుశాసనములో నన్నయ అతని బహుభాషా పాండిత్యమును, కవిశేఖరత్వమును వర్ణించియుండెను. ఆవర్ణనలోనసయఛూ లేశముకూడ గోచరింపదు. నారాయణభట్టు కవియు, పండితుడును మాత్రమేకాక, రాజనీతి కుశలుడై కూడ నుండెననుటకు తార్కాణములున్నవి. అతడు కొంతకాలము పశ్చిమ చాళుక్యచక్రవర్తియైన త్రైలోక్యమల్లదేవరయొద్ద మంత్రియైయుండినట్లు క్రీ.శ. 1055 లో అతని కూతురు కుపమ దాక్షారామమున వేయించినశాసనమువలన తెలియుచున్నది. బహుశః రాజరాజు పశ్చిమచాళుక్యులతో సంధిచేయ కాంక్షించినప్పుడు నన్నయ తన మిత్రుడైన నారాయణభట్టు ద్వారా కొంతసాహాయ్యము చేయించియుండునని యూహింపవచ్చును. ఆ సాహాయ్యమునకు కృతజ్ఞత సూచించుటకో, లేక నారాయణ భట్టుబహుభాషాపాండిత్యమునకలరియో. రాజరాజాతనికి నందంపూడి నగ్రహారముగ నిచ్చియుండెను. నన్నయ చెప్పినట్లు భారతరచనా సందర్భమున పండితా ఖండలుడైన యతడు కొంత సాహాయ్యము కూడ చేసియుండవచ్చును. ఆసాహాయ్య మెట్టిదో మన మూహింపవచ్చును.

మహాభారతము గహనమువంటి మహాగ్రంథము. వ్యాసుడు దానిని రచించిన పిమ్మట నది మౌఖికముగ ప్రచారము పొందియుండుటచే నందు పెక్కు ప్రక్షేపములు, పునరుక్తులు ప్రవేశించి యుండవచ్చును. అందుచే దానిని తెనుగున రచియించు నపుడు, ఆ ప్రక్షేపములను, పునరుక్తులనుతొలగించి దానిని సరళము, సరసము కావింపవలసిన యవసరమున్నది. రచనారంభమునకు ముందు నన్నయ చేయవలసిన పూర్వరంగ మెంతో కలదు. అతడు భారతమునంతను చదివి వ్యాసరచిత పాఠమేదో గ్రహించుట

సులభ సాధ్యమైన పనికాదు. దానికితర పండితుల సాహాయ్యము కూడ నావశ్యకమై యుండును. అట్టియెడ మిత్రుడును సహాధ్యాయుడునైన నారాయణభట్టు ఏ ఏ భాగములు తగ్గింపవలయునో, ఎచ్చట పెంచిన కావ్యత్వముచేకూరునో, రసపాత్ర పోషణ మెట్లుండవలయునో నిర్ణయించుటయందు తోడ్పడియుండవచ్చును. మహాభారతము పంచమవేదము. దానిని దేశభాషలో రచించుట కప్పటి పండితులంగీకరింపక, కొంత నిరసనము తెలిపియుండవచ్చును. అప్పుడు కన్నడ తమిళములందు భారతము రచింపబడియుండుటయు, భారతము సామాన్యజనులకు సుబోధమైన తెలుగులో వ్రాయవలసిన యావశ్యకమును వివరించి నన్నయభట్టుతోపాటు నారాయణభట్టుకూడ వారిని శాంతింపజేసి యుండవచ్చును. రాజాభిలాషకూడ దానికనుకూలముగా నుండుటచే పండితులు హృదయములందేమి తలంచినను దానికంగీకారము చూపి యుండవచ్చును. నన్నయ భారతము రచింపనారభించునాటికి తెలుగుభాష విస్తృతమును, సలక్షణమునైన స్థితిలో లేకుండెను. అట్టి భాషలో మహాభారతమువంటి గొప్ప కావ్యమును రచించుటెట్లని నన్నయ నిరుత్సాహపడుచుండినచో ప్రతిపక్షమున నున్న గురుబంధుమిత్రులను చూచి విషణ్ణుడై రథమున కూలబడిన అర్జునునికి తత్త్వముతెల్పి, ఉత్సాహముగొల్పి, భుజముతట్టి అతనిని - యుద్ధోన్ముఖునిగావించిన కృష్ణునివలె నారాయణభట్టు కూడ పంపకవి కన్నడమున భారతమురచించిన విధానమును తెల్పి నన్నయ నిరుత్సాహమును తొలగించియుండవచ్చును. పంపకవి కన్నడమున భారతము వ్రాయునపుడు సంస్కృతపదములను, సమాసములను ఎన్నిటినోవాడియుండెను. ఈ తత్సమీకరణ విధానమునకూడ నారాయణభట్టు నన్నయభట్టునకు మార్గదర్శియై యుండవచ్చును. అందుచేతనే నన్నయ నారాయణభట్టు "తోడయి నిర్వహింపగన్"అని తన కృతజ్ఞతను సూచించియుండెను.నారాయణభట్టేకాక యితర విద్వజ్జనులుకూడ అతనికి వాక్సాహాయ్యమొనర్చి యుండవచ్చును. అందుచేతనే అతడు 'విద్వజ్జనుల యనుగ్రహంబునంజేసి' యను పదమును కూడ వాడియుండెను. నన్నయ నారాయణభట్టును బహుభాషాపండితుడనియు, కవిశేఖరుడనియు, కవీభ వజ్రాంకుశ బిరుదధారి అనియు, నుతించియున్నను అతడు తెలుగునకాని కన్నడమునగాని,మఱియేభాషలోకాని రచించినగ్రంథమొక్కటియు నిప్పుడు లభించుటలేదు.

అవతారిక యందలి చివరి పద్యము నన్నయ కవిత్వమునందలి గుణములను పేర్కొనుచున్నది. ఆగుణములాతని కవిత్వమున సర్వతోముఖములై గోచరించును: అతని కవిత్వమునుగూర్చి వ్రాయునప్పుడా గుణముల సార్థక్యము వివరింప

బడును. నన్నయభట్టు భారతమును మహాభారత సంహిత యని పేర్కొనెను. అతని దృష్టిలో భారతము సంహితాతుల్యమేకాని కేవల కావ్యమాత్రముకాదు. నన్నయభారతమును వ్రాయుట జగద్ధితము కొఱకు. ఆధునికులు కొందఱు పూర్వకవులకు సామాజిక స్పృహలేదని చెప్పుచుందురు. నన్నయ జగద్ధితమునకై నేను భారతమును వ్రాయుచున్నానని స్పష్టముగా చెప్పుచుండగా వారట్లెందుకందురో తెలియకున్నది. ఒక నన్నయయేకాదు తిక్కనయు పోతనయు కూడ లోకహిత నిష్ఠ, జగద్ధితము అను పదములను వాడియుండిరి.

తరువాతి కావ్యములలో కృతిభర్త కవి నాహ్వానించి సత్కరించి తనకకింతముగా కావ్యము రచింపుమని కవిని కోరినట్లుండును. రాజరాజు నన్నయతో 'తెనుగున రచియింపుమధిక ధీయుక్తిమెయిన్' అని మాత్రమే పల్కెనుగాని భారతము తనకకింతము చేయుమని అడిగినట్టెచ్చటనులేదు. కాని నన్నయ ఆశ్వాసాద్యంతములందు రాజరాజును సంబోధించు పద్యములు వ్రాసియుండెను. దీనిని బట్టి నన్నయ తనభారతమును రాజరాజునకంకితము చేసెననియే భావింపవచ్చును. లేదాపాల్కురికి సోమనాథునివలె రాజరాజును తనభారతమునకు శ్రోతగా తలంచి ఆశ్వాసాద్యంతములందాతనిని సంబోధించి యుండవచ్చును.

భారతాంధ్రీకరణమునకు వైదికమతోద్ధరణ ప్రయత్నము కూడ కారణమయ్యెనా లేదా అను విషయమున కూడ భిన్నాభిప్రాయములున్నవి. వైదికమతోద్ధరణమునకై భారతము నాంధ్రీకరింపుమని రాజరాజెచ్చటను చెప్పియుండలేదు. కాని భారతబద్ధస్పృహులగు వారికి బహుయాగముల ఫలముచేకూరుననియు, నన్నయ, అవిరళజపహోమతత్పరుడనియు చెప్పబడుటయు, రాజరాజు పరమధర్మవిదుడనియు వివిధాగమ విజితశ్రముడనియు, వర్ణాశ్రమ ధర్మరక్షణ మహిమతో నొప్పువాడనియు, మనుమార్గుడనియు అగ్రజన్మలకనుగ్రహమున చారుతరమహాగ్రహారమ్ములిచ్చుచు దేవభోగముల కొనసాగింపఁజేయుచుండెననియు వర్ణింపఁబడుటయు వైదికభారతాంధ్రీకరణమునకు మతోద్ధరణప్రయత్నముతో కూడ సంబంధమున్నదని యూహించుటకవకాశము కలుగుచున్నది. నన్నయ ఆశ్వాసాద్యంత పద్యములలో రాజరాజునకు వాడిన విశేషములు కూడ ఈయూహను బలపఱుచుచున్నవి. మన పూర్వులు మోక్షప్రాప్తికి జ్ఞానకర్మభక్తిమార్గములు మూడు నిర్ణయించి యుండిరి. కర్మమార్గమున వేదములకును తచ్చోదితకర్మకలాపములకును అధికమైనప్రాధాన్యమున్నది. ఈరెండిం

టికిని బ్రాహ్మణులకును సన్నిహిత సంబంధముకలదు-మూలమున లేకున్నను నన్నయ తనరచనమున వేదములను, వేదోక్తవిధులను, వేదవిప్రులను ప్రశంసించుచు వ్రాసిన పద్యములు అతని మనస్సున వైదికమతోద్ధరణ వాంఛ కూడ కలదేమో ఆనెడి సందేహమును కల్గించుచున్నది. అతడుమూలమందున్న వేదయజ్ఞప్రశంసాదులను తగ్గించినచోట్లుకూడ లేకపోలేదు కాని అట్టివాని సంఖ్య తక్కువ. అంతేకాక అతడట్లచ్చట చేయుటకు ప్రత్యేకకారణమున్నది. ఆ రోజులలో జైనబౌద్ధాదులు చేయుచుండిన ప్రచారమును పరికించినచో వైదికమతాభిమానులిట్టి ప్రయత్నమును చేసియుండిరను నూహ ఉచితముగానే తోచును. మరియు 11వ శతాబ్దిలో పంచమవేదమైన భారతమునెడ ఎందరో ఎన్నోవిధముల అభిమానము చూపినట్లు కానవచ్చుచున్నది. క్షేమేంద్రుడప్పుడే భారతమును సంగ్రహించి భారత మంజరిని రచించెను. సుమిత్రాజావా ద్వీపములనుండి ఆకాలముననే కొందఱు మతాభిమానులు భారతదేశమునకువచ్చి సంస్కృతభారతప్రతులను వ్రాసికొనిపోయినట్లు చరిత్ర వలన తెలియుచున్నది.

నన్నయ పర్వసంగ్రహమున ఏపర్వమున నేవిషయములుకలవో తెలుపుచు అందలిశ్లోకసంఖ్యను కూడ తెలిపియుండెను. దీనినిబట్టి నన్నయగ్రహించిన మూలమున నప్పుడే పర్వముననెన్నిశ్లోకములుండెనో స్పష్టముగా తెలియుచున్నది. పూనాయందలి భండార్కరు పరిశోధనానంస్థవారు సంశోధిత సంస్కృతభారతప్రతిని సిద్ధముచేయునపుడు వివిధప్రాంతములనుండి తాళపత్రప్రతులను, లిఖితప్రతులను తెప్పించియుండిరి. ఆ సంశోధితప్రతి సంపాదకుడు వివిధప్రతులనుగూర్చి వ్రాయుచు నన్నయ పర్వసంగ్రహమున సూచించిన శ్లోకములసంఖ్య 11వశతాబ్దినాటి సంస్కృత భారతము యొక్కస్థితిని చక్కగా తెలుపుచున్నదని దానినెన్నోవిధముల ప్రశంసించియుండెను. ఈవిధముగా నన్నయ అవతారికయు పర్వసంగ్రహమును, పెక్కుముఖ్య విషయములను తెలుపుచు పండితప్రశంసలకు పాత్రములగుచున్నవి.

* * *

ఉన్నత గోత్రసంభవము, నూర్జితసత్త్వము, భద్రజాతి సం
పన్నము నుద్ధతాన్య పరిభావి మదోత్కటము న్నశేంద్ర పూ
జోన్నయ నోచితంబు నయియొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.

# 4 నన్నయ్య అనువాద పద్ధతి

నన్నయ అనువాదవిధానమును పరిశీలించుటకు ముందతడు సంస్కృతభారతముయొక్క యే ప్రతిననుసరించెనో తెలిసికొనవలసిన ఆవశ్యకమెంతైన నున్నది. వ్యాసభారతము రచింపఁబడినప్పటినుండియు నొకేవిధముననుండెనని తలంచుటకు వీలులేదు. వ్యాసుడు మొదట రచించినప్పుడందు 8,800 శ్లోకములుండెననియు, వైశంపాయనుడు జనమేజయునకు చెప్పునప్పుడందలి శ్లోకములసంఖ్య 24,000 వఱకు పెరిగెననియు, సౌతి శౌనకాదిమహర్షులకు చెప్పునప్పుడాసంఖ్య లక్షవఱకు పెంపొందెననియు కొందఱు చెప్పుదురు.

అష్టౌ శ్లోకసహస్రాణి అష్టౌశ్లోకశతానిచ
అహంవేద్మిశుకోవేత్తి సంజయోవేత్తివా నవా.
చతుర్వింశతిసాహస్రీం చక్రేభారతసంహితామ్
ఉపాఖ్యానైర్వినా తావత్ భారతంప్రోచ్యతేబుధై:
ఇదంశతసహస్రంహి శ్లోకానాం పుణ్యకర్మణాం
సత్యవత్యాత్మజేనేహ వ్యాఖ్యాత మమితౌజసా

అనుశ్లోకములందుకుప్రమాణములు. ఈ విషయమెంతవఱకు సత్యమో నిర్ణయించుట కవకాశము లేదు. భారతముపంచమవేదగౌరవమునందుటచే భారతీయులు దానిని పరమపవిత్రగ్రంథముగ భావించుచుండిరి. పండితులును పౌరాణికులును దానినిమహాసభలయందును, యజ్ఞాదిసందర్భములందును, తీర్థక్షేత్రములయందును ప్రవచించుచుండిరి. అనగా అది చాలాకాలము మౌఖికముగనే ప్రచారముపొందెను. అందుచే నందుప్రక్షేపములును పాఠభేదములును ప్రవేశించుటలో నాశ్చర్యములేదు. వ్యాసభగవానుని నోటవెలువడిన మూలభారతమిదేయని నిర్ణయించుట కష్టసాధ్యము.

సంస్కృతభారతప్రతులను సాధారణముగా దాక్షిణాత్యవర్గము ఔత్తరాహవర్గము అని రెండుప్రధానవర్గములుగా విభజింతురు. ఒకేవర్గమునకుచెందిన ప్రతులలోనే భిన్నపాఠములుండుటకును, కొన్నిచోట్ల ఉత్తరదక్షిణప్రతులసమ్మేళనముతో కూడిన ప్రతులుండుటకును అవకాశముకలదు. ఇన్ని ప్రతులలో నేది వ్యాసభారతమునకు సన్నిహితమో, దేనిని నన్నయ గ్రహించెనో. తెలిసికొనుట అసంభవము. అందుచే లభ్యమైన యేదోయొకప్రతినిగ్రహించి దానితో నన్నయ రచననుపోల్చి "అతడిచ్చట పెంచెను; ఇచ్చటతగ్గించెను; ఇచ్చటమార్చెను" అని

చెప్పుట ఉచితముకాదు. అతడు గ్రహించిన ప్రతికాని దాని యథార్థమైన (అనగా మార్పు చేర్పులు లేని) ప్రతి కాని ఇప్పుడు లభించుట కష్టము. అయినను నన్నయ గ్రహించిన ప్రతికి సన్నిహితమైనదేదో తెలిసికొనయత్నించి అప్పుడాతని అనువాద విధానమును పరిశీలింపవలయును.

నన్నయ పర్వసంగ్రహమున తానుగ్రహించిన సంస్కృతభారతమున ఏఏ పర్వమున ఎన్నెన్నిశ్లోకములుకలవో స్పష్టముగా చెప్పియున్నాడు. ఆ సంఖ్యయేకల పర్వములతో కూడిన సంస్కృత భారతమిప్పుడు ఉత్తర దక్షిణ వర్గములకు చెందిన ప్రతులలోనెచ్చటను కనిపించుటలేదు. నన్నయ ఏదోయొక్క ప్రతినే గ్రహించి భారతమును తెలుగున వ్రాయుటకు మొదలుపెట్టెనో లేక పెక్కుప్రతులను పరిశీలించి తనప్రతిని తానుసిద్ధము చేసికొనెనో చెప్పుటకాధారములు లేవు. అంతే అతడుగ్రహించిన ప్రతియొక్క పుత్రిక యిప్పుడెక్కడనైన నున్నదని చెప్పజాలము. పూనా యందలి భండార్కరు పరిశోధకసంస్థవారు పెక్కులిపులలో వ్రాయబడిన భారత ప్రతులనెన్నిటినో పలుప్రాంతములనుండి తెప్పించి, తమ పరిశోధిత ప్రతిని సిద్ధము చేసియుండిరి. వానిలో నన్నయ గ్రహించిన మూలమునకు పుత్రిక ఉన్నదోలేదో మనకు తెలియదు. నన్నయ దాక్షిణాత్యుడగుటచే దాక్షిణాత్య వర్గమునందలి ఒక ప్రతిని గ్రహించి తనరచననారంభించెనని మనమూహింపవచ్చును. కాని అట్లూహించుటకు కూడ కొన్ని ఆటంకములు కనిపించుచున్నవి. సభాపర్వమున భీష్ముడు శిశుపాలునితో శ్రీకృష్ణుని మహాత్మ్యమును చెప్పిన రెండువేలశ్లోకములతో కూడిన యొక భాగము దాక్షిణాత్యప్రతులందు మాత్రమేకలదు. నన్నయ దానిని విడిచివేసెను, అట్లే ఔత్తరాహవర్గమునకు చెందిన ప్రతులలో మాత్రముండి, దక్షిణప్రతులలో నెచ్చటను కానరాని భాగముల అనువాదములు కూడ అతనిరచనలో నెడనెడ కానవచ్చుచున్నవి. దీనినిబట్టి అతడుత్తర వర్గమునకు చెందిన ప్రతినే అనుసరించెననుకొందమన్న దానికిని ఎన్నో ఆటంకములున్నవి. అందుచేనీతడు రెండువర్గముల ప్రతులను పరిశీలించి ప్రక్షేపములను, పునరుక్తులను తొలగించి తాననుసరింపవలసిన ప్రతిని స్వయముగా సిద్ధముచేసికొనెనేమో అను సందేహముప్పతిల్లుచున్నది. నీలకంఠుడు మహాభారతమునకు భారతభావదీపమను వ్యాఖ్యానమును రచించుచు అవతారికలో

"బహూన్సమాహృత్య విభిన్నదేశ్యాన్
కోశాన్వినిశ్చిత్యచ పాఠమగ్ర్యం
ప్రాచీంగురూణామనుసృత్యవా చ
మారభ్యతే భారతభావదీపః"

అని వ్రాసియుండెను. దీనినిబట్టి అతడు వివిధ ప్రాంతములకు చెందిన ప్రతులను పరిశీలించి ఉత్తమములైన పాఠములను నిర్ణయించి పెద్దలవచనముల ననుసరించి వ్యాఖ్యానము వ్రాయుటకు మొదలిడెనని తెలియుచున్నది. నన్నయకూడనట్లే తెలుగు లిపిలోనున్న ఒక దాక్షిణాత్యప్రతిని మూలముగా గ్రహించి, ఇతరములైన ప్రతులను కూడ పరిశీలించి, అందు మార్పుచేర్పులు కావించి తనప్రతిని తాను సిద్ధముచేసి కొనియుండెను. ఆంధ్రభారతమున యయాతిచరిత్ర తరువాత దుష్యంతోపాఖ్యాన మున్నది. అది సమంజసమే. కాని ఉత్తరప్రతులలో దుష్యంతోపాఖ్యానము తరువాత యయాతిచరిత్రము కనవచ్చుచున్నది, ఈ ఉత్తరప్రతులను చూచి కొందఱు విమర్శకులు నన్నయ కథాక్రమమును సముచితముగా మార్చి మూలమునందలి అపక్రమమును తొలగించెనని చెప్పుచుందురు. కాని పెక్కు దాక్షిణాత్యప్రతులలో నన్నయ అనుసరించిన క్రమమే కానవచ్చుచున్నది. అప్పుడాతడు కావించిన మార్పేదియు లేదనియే చెప్పవచ్చును. అందుచేతనే నన్నయ అనువాదవిధానము పరిశీలించునప్పుడు అతడనుసరించిన మూలమేదియో తెలిసికొనుట ముఖ్యమని చెప్పవలసివచ్చినది. లేనిచో వ్యాసుడు భారతమున కొన్నిచోట్ల కథయందుక్రమమునను సరింపలేదని చెప్పి మనమాతనియెడ అపరాధము చేసినవారమగుదుము.

ఆంధ్రభారతమున స్వర్గారోహణ పర్వమువఱకునుగల కథ వ్రాయబడినది. తరువాత హరివంశాదులు వచ్చును. కొందఱాఖిలపర్వములు మూడని చెప్పుదురు. హరివంశపర్వము, విష్ణుపర్వము, భవిష్యత్పర్వము అని వాని నామములు. నన్నయ పర్వానుక్రమణికలో శతపర్వముల పేర్లు చెప్పెనుకాని స్వర్గారోహణము తరువాత హరివంశము, భవిష్యత్పర్వము అను రెండింటిని మాత్రమే పేర్కొని యుండెను. అతడు చూచిన ప్రతిలో విష్ణుపర్వమునందలి విషయము కూడనున్నను ఆ పర్వము ప్రత్యేకముగా పేర్కొనఁబడియుండలేదేమో. నన్నయ యిచ్చిన సంఖ్యననుసరించి ఆదిపర్వమునందలి శ్లోకముల సంఖ్య 9984. ఆంధ్ర భారతమునందలి ఆది పర్వములోఁగల గద్యపద్యముల సంఖ్య 2091. దీనినిబట్టి అతడు మూలమును నాల్గవ వంతునకు తగ్గించెనని స్థూలముగా చెప్పవచ్చును. కాని ఇది యుక్తముకాదు. ఏలయన సంస్కృతమునందలి అనుష్టుప్ శ్లోకముల పరిమితికిని తెనుఁగునందలి సీసములయు, వృత్తములయు, వచనములయు పరిమితికిని చాలబేధమున్నది అయిదారనుష్టుప్పుల యందలిభావమును ఒక్క సీసములోనిముడ్చవచ్చును. అట్లే దీర్ఘములైనవచనములందు

పదిమొదలు ఇరువదివఱకునుగల అనుష్టుప్పుల విషయమును వ్యక్తము చేయుట కవకాశమున్నది. కవిత్రయమువారు సంస్కృత భారతమునందలి కొన్ని భాగములను తగ్గించినమాట సత్యమే. కాని ఒకవంతు మాత్రముగ్రహించి మూడువంతులను విడిచిపెట్టి యుండలేదు. ఒకవిధముగా సంస్కృత భారతము తెలుగున సగమునకు కుదింపఁబడినదని చెప్పవచ్చును. ఈ కుదింపునకు, మూలమునందలి వర్ణనములను, సంభాషణములను, ప్రశ్నోత్తరములను, పురనదీయుద్ధరాజగుణ పరిపాలన విధానములను, ధర్మనీతితత్త్వమయోపన్యాసములను, వ్యక్తి వస్తునామముల పట్టికలను సంక్షేపించుటయే కారణము. వారి సంక్షేపవిధానమువలన కథాగమమున కెచ్చటను భంగము కలుగపోవుటయేకాక ఒక ప్రసన్నత కూడ ఏర్పడినది. ఈ గ్రంథమున భండార్కరు ప్రాచ్యపరిశోధన సంస్థవారు ప్రచురించిన సంశోధిత భారతప్రతిని మూలముగా గ్రహించి నన్నయ పరిశోధన పద్ధతిని వివరించుట జరిగినది.

కవిత్రయమువారు వ్యాసభారతము నాంధ్రీకరించిరని సాధారణముగ నందఱును చెప్పుచుందురు. కాని వారు సంస్కృతభారతమును మక్కికి మక్కిగా నాంధ్రీకరించియుండలేదు, భారతమునంతను చదివి యందలిభావములను జీర్ణముచేసికొని అనవసరములని తోచిన భాగములను తగ్గించియు,అవసరములని తోచిన భాగములను పెంచియు, అశ్లీలములనితోచినచోట్లను అన్యథాకరించియు వారాంధ్రభారతమొక స్వతంత్రగ్రంథమువలె ప్రతిభాసించునట్లొనరించిరి. అందుచే సంస్కృతాంధ్రభారతములను దగ్గరనుంచుకొని ఏశ్లోకమున కేపద్యమనువాదమోచూడగోరువారు నిరాశ పొందుదురు. ఆంధ్రమునందలి, అనువాదవిధానమును కథానువాదము, భావానువాదము, పదానువాదము అనిమూడు విధములుగా విభజింపవచ్చును. కథానువాదమున కథకును, భావానువాదము భావములకును, పదానువాదమున పదములకును ప్రాధాన్యము హెచ్చుగానుండును. ఇందుత్తరోత్తరమున అనువాదము మూలమునకు సన్నిహితతరముగా గోచరించును.కవిత్రయమువారిది కథానువాదము వారు మూలమునందలి కథాభాగమునెచ్చటను విడవక వర్ణనములను, రసప్రాతపోషణమును, తమ యిచ్ఛవచ్చినట్లొనరించుచు దానికొక స్వతంత్రమైన అనువాదముగా సంతరించిరి. కవిత్రయమువారికి వ్యాసునియెడ నపారమైన గౌరవముకలదు. వ్యాసునికంటె తామెక్కువ పండితులమనిగాని, గొప్పకవులమనిగాని వారెన్నడును భావించియుండలేదు. వారు కావించిన వ్యాస స్తుతిపద్యములను పఠించుచో నీవిషయము తేటతెల్లము కాగలదు. వ్యాసుడు మహాముని, క్రాంతచక్షువు, అతడు పౌరాణిక నైతిక దృష్టితో

భారతమును, ఇతర పురాణములను రచించియుండెను. వానిద్వారా ధర్మనీతితత్త్వమును పతితుల కుపదేశింపవలెనని యాతని ప్రధానోద్దేశము. రసవంతమగు ఒక మహాకావ్యమును వ్రాయవలెనను దృష్టితో నతడు భారతమును వ్రాసియుండలేదు. కాని యతడు ఋషిపుంగవుడగుటచే నతని రచనమున తలవని తలంపుగా కావ్యలక్షణములెన్నో ప్రవేశించినవి. నీతిధర్మములను బోధింపవలెనను దృష్టి కవిత్రయము వారికికూడ నున్నను వారిది ప్రధానముగా కావ్యకళాదృష్టి. నన్నయ "ఇమ్మహాకావ్యంబు రచియించెద"ననియు, ఎఱ్ఱన "తద్రచనయకానారణ్య పర్వశేషము పూరించెద" ననియు, తిక్కన "అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబుగఁజేసెద"ననియు పల్కుట చూడవారు మూలమును యథాతథముగా ననువదించుటకుకాక తదర్థవివరణము కావించుటకే యత్నించి మహాభారతమునొక కావ్యముగా రూపొందింపదలచిరనియే, తెలియవచ్చును. మఱియు వ్యాసుడు నివసించిన కాలమునకును, కవిత్రయము వారి కాలమునకును 15 మొదలు 20 శతాబ్దులవఱకును వ్యత్యాసముకలదు. ఈ మధ్య కాలమున సాంఘికాది పరిస్థితులలో కొన్ని మార్పులు కలిగియుండవచ్చును. అందుచే ఆ మార్పులను దృష్టిలో నిడుకొనియు, మహాకావ్యమును వ్రాయవలెనని భావించియు కవిత్రయము వారు వ్యాసభారతము నచ్చటచ్చట పెంచుటయు, తగ్గించుటయు, మార్చుటయు సంభవించెను. ఈ మార్పులు దృష్టిభేదమును, కాలభేదమును సూచించునుగాని కవిత్రయమువారికి వ్యాసునియెడ గౌరవలోపమున్నదని సూచింపదు.

ఎ) నన్నయ పూర్తిగా విడిచిన భాగములు :-

అనువాదము చేయునపుడు నన్నయ ప్రధానకథతో సంబంధములేని విషయములను, అనుచితముగా కనఁబడు విషయములను, తత్త్వవిషయబాహుళ్యముతోకూడి సామాన్యులకు దురవగాహములుగానుండు విషయములను పూర్తిగా విడిచివేసియుండెను. అందుకొన్ని యాతడు గ్రహించిన మూలములో లేకపోవుటయు సంభవించియుండును.

(i) సంస్కృత భారతప్రథమాధ్యాయమున సౌతిభారతకథను సంగ్రహముగా తెల్పుచు యుద్ధమున పాండవులు జయించుచుండగా ధృతరాష్ట్రుడు సంజయుని పిలిచి దుర్యోధనుని దుశ్చేష్టలను తలంచి "యదాశ్రౌష"మాదిగాగల (ఎప్పుడు వింటినో అప్పుడే) యేఁబదియైదు శ్లోకములలో కౌరవ పాండవుల వృత్తాంతము నందలి ఒక్కొక్క ఘట్టమునే స్మరించుచు అప్పుడే తనకు విజయముపై ఆశపోయెనని తెల్పి దుఃఖించిన వృత్తాంతము వర్ణించినట్లున్నది. దీనిని యదాశ్రౌష

పర్వమందురు. ఇప్పుడిది ఉత్తర దక్షిణప్రతులన్నిటియందును కానవచ్చును. కాని యిది ప్రక్షిప్తమని విమర్శకుల అభిప్రాయము. నన్నయ గ్రహించిన మూలములో నిదియున్నదో లేదో మనకు తెలియదు. అందీ వృత్తాంతము లేకపోవుటచేతనో, ఇది అనవసరమని తోచుటచేతనో నన్నయ దీనిని పూర్తిగా విడిచివైచెను.

(ii) మూలమున ఆదిపర్వ తృతీయాధ్యాయమునందు ధౌమ్యుని శిష్యులయిన ఉపమన్యువు, ఆరుణి, వేదుడు అనువారి వృత్తాంతముకలదు. వీరిలో వేదునే నన్నయ పైలుడని పేర్కొనెను.జనమేజయునికి సర్పయాగ బుద్ధినిపుట్టించిన ఉదంకుడు పైలుని శిష్యుడు. ఆంధ్రభారతమున 'పంకజనన్నిభుడఘపంకక్షాళన మహాతపస్సలిలుడనాతంకమతి పైలశిష్యుడుదంకుడను మునివర్యుడు తద్దయుభక్తిన్'అను పద్యముతో భారతకథ నారభించెను.ఉదంకుని గురువగుటచే పైలునికథకు భారతముతో కొంత సంబంధమున్నది. కాని యాతడు ధౌమ్యునొద్ద విద్యనభ్యసించుటకుకాని, అతని సహపాఠుల వృత్తాంతమునకు గాని భారతములో సంబంధములేదు. ఈ కారణముచేతనే మూలమునందున్నను నన్నయ దీనిని విడిచివేసియుండును.

(iii) దుష్యంతోపాఖ్యానమున దుష్యంతుడు శకుంతలను గ్రహింపక తిరస్కరించు సన్నివేశమున "నిరనుక్రోశయు, బంధకియుఅగు మేనక నీతల్లి, నిరనుక్రోశుడును క్షత్రయోనియు బ్రాహ్మణత్వమున,లుబ్ధుడును,కామపరాయణుడును అగు విశ్వామిత్రుడు నీ తండ్రి" అని మేనకా విశ్వామిత్రులను కూడ దూషించినట్లు మూలమునందున్నది. దుష్యంతుని శీలమునకు కళంకము నాపాదించుననికాబోలు నన్నయ ఆ దూషణమును విడిచివేసెను.

(iv) రాజసూయయాగ సందర్భమున సహదేవుడు జయించిన రాజులను పేర్కొనుచు మూలము "ఆంధ్రాంస్తలవనాంశ్చైవ" అని అతడు ఆంధ్రులను కూడ జయించినట్లు తెల్పుచున్నది. కొన్నిప్రతులలో నిచ్చట ఆంధ్ర శబ్దమునకు పాఠాంతరమున్నది. నన్నయగ్రహించినప్రతిలో నెట్లున్నదో మనకు తెలియదుకాని, నన్నయ సహదేవుడు జయించిన రాజుల పట్టికనుండి ఆంధ్రులను తొలగించెను. అతడట్లుచేయుట కాంధ్రాభిమానమే కారణమైయుండును.

(v) శిశుపాలుడు భీష్ముని రెండుచోట్ల భూలింగపక్షితో పోల్చుట మూలమున కానవచ్చును. ఆపక్షి సర్వదా 'మాసాహస'మ్మని పల్కుచుతాను ఘాత్రము సాహ

నము చేయుచుండునట. సింహదంతార్గత మాంసార్గలము దానికాహారము. అట్లే శిశుపాలుడు భీష్ముని "యుక్తమేతత్తృతీయాయాంప్రకృతా వర్తితా త్వయా" అని తృతీయాప్రకృతిగా వర్ణించెను. భీష్ముని భూమిగపక్షితో పోల్చుటగాని, తృతీయాప్రకృతియనుటగాని అసభ్యములుగా తోచుటచే నన్నయ ఆ ఉపమానములను విడిచివేసెను.

(vi) సభాపర్వమున దుర్యోధనుడు పాండవవైభవమునుగాంచి కృశించి వివర్ణుడైన ప్పుడు శకుని అతనితో "పాండవులు తమభాగమును తామనుభవించు చున్నారు. నీవు వారియెడనసూయవహించుట తగదు. ఇష్టమున్నచో భీష్మద్రోణాదులసాహాయ్యమున యుద్ధమున వారినోడించి ఆ రాజ్యభాగమును కూడ గ్రహింపు"మని ధర్మోచిత వాక్యములు పల్కి అతనినూరడించినట్లు మూలమున నున్నది. కపటాత్ముడైన శకునిచే నట్టిధర్మోపదేశము చేయించుట అతని స్వభావమునకు విరుద్ధమని నన్నయ దానిని విడిచివైచెను.

(vii) ఆరణ్యపర్వమున పాండవులు కామ్యకవనమును విడిచి ద్వైతవనమున కరిగినపుడు పౌరులును, బ్రాహ్మణులును దుఃఖించిన వృత్తాంతమున్నది. ఈసన్ని వేశము పాండవ వనగమన సందర్భమునందలి పౌరాదుల దుఃఖమును వర్ణించు సన్నివేశమునే పోలి యుండుటచే పునరుక్తిని తొలగించుటకై నన్నయదానిని విడిచివేసెను.

(viii) ఆరణ్యపర్వమునందలి నలువది ఏడవఅధ్యాయమున జనమేజయుడు వైశంపాయనుని వనమున పాండవులేమేమి భుజించిరో తెలుపుమని యడిగెను. అప్పుడు వైశంపాయనుడు

"వానేయంచ మృగాంశ్చైవ శుద్ధైర్బాణైర్నిపాతితాన్
బ్రాహ్మణానాంనివేద్యాగ్ర మభుంజన్ పురుషర్షభాః"
"రురూన్ కృష్ణమృంగాశ్చైవమేధ్యాం శ్చాన్యాన్ వనేచరాన్
బాణైరున్మథ్య విధివద్బ్రాహ్మణేభ్యోన్యవేదయత్ (యుధిష్ఠిరః)

అని చెప్పెను-పాండవులు బాణములచే వివిధ మృగములను చంపి తన్మాంసమును మొదట బ్రాహ్మణులకు నివేదించే తరువాత తాము భుజించిరని యిందలి యర్థము. తన కాలమునకు బ్రాహ్మణులు మాంసమును భుజించుట నిషిద్ధమైపోవుటచే నన్నయ ఆ విషయమును విడిచియుండును. మఱియు ఈ నలువదిఏడవఅధ్యాయము తీసివేసినను

కథాగమనమున కెట్టిఆటంకమునురాదు. ఆకారణముచే కూడ నన్నయ దానిని విడిచి యుండవచ్చును.

**(ix)** సౌగంధికాపహరణకథలో భీముడడుగగా హనుమంతుడతనికి త్రయీవార్తా దండనీతులను గురించియు, నాలుగు వర్ణములవారి ధర్మములను గూర్చియు చెప్పినట్లు మూలమున నున్నది. వ్యాసుడాసందర్భమున వానిని పాఠకులు తెలిసికొనుటకై వ్రాసియుండును. ధర్మతత్త్వ బోధనమతడు భారతము వ్రాయుటయందలి ప్రధానోద్దేశముకదా! కాని ఆవిషయమిచ్చటి కథకు అప్రసక్తమగుటచే నన్నయ విడిచివైచెను.

**(x)** నూటడెబ్బదినూడవ అధ్యాయమున భీమ నకుల సహదేవులు విజృంభించి దుర్యోధనుని సంహరించుటకై ఏగుదుమని ధర్మరాజుతోచెప్పిన వృత్తాంత మున్నది. అప్పటికింకను వనవాసము పండ్రెండేండ్లుకాలేదు. అందుచే నీ అన మయ విజృంభణమును వర్ణింపుచేలయని నన్నయ దానిని విడిచివైచెను.

బి) నన్నయ సంక్షేపించిన భాగములు:-

నన్నయపూర్తిగా విడువక మూలమున విస్తృతముగానున్న భాగములను సంగ్రహముగా చెప్పినఘట్టములు కొన్నియున్నవి.

**(i)** ఉదంకుడు తక్షకునివెంట నాగలోకమునకేగి యచటసితాసితతంతు సంతాన పటుంబు ననువయించుచున్న యిద్దరు స్త్రీలను ద్వాదశార చక్రము పరివర్తిం పించుచున్న అఱుగురు కుమారులను, ఒక దివ్యపురుషునిచూచి వారిని నాలుగు శ్లోకములతోస్తుతించినట్లు మూలము నందున్నది. నన్నయ యీ సందర్భమున ఆ నాలుగుశ్లోకముల అర్థమును యథాతథముగా తెలుపక "విపులార్థవంతంబు లైన మంత్రంబుల నీతిభక్తియుతుడై స్తుతియించిన"యని సంక్షేపముగా వ్రాసి యూరకుండెను,

**(ii)** ఆదిపర్వమునందలి డెబ్బదితొమ్మిదవయధ్యాయమున యయాతి తన కొడుకు లను బిలిచి తనముదిమిగైకొని వారి యౌవనము తన కిమ్మనియడుగగా వారు నిరాకరించినట్లును, అతడు వారిని శపించినట్లును వేరువేరుగా వర్ణింపబడినది. నన్నయ యయాతి కొండుకుల నందఱినొకేసారి పిలిచి యడిగినట్లును వారం దఱును నిరాకరణ పూర్వకముగా ఒకే సమాధానమిచ్చినట్లెను, వ్రాసియచటి భాగమును సంగ్రహించెను.

(iv) అట్లే ఎనుబదినాల్గవ యధ్యాయమున అష్టకాదు లడిగిన ప్రశ్నలను నన్నయ సంగ్రహించి వానికి సమాధానములను మాత్రము యయాతిచే చెప్పించెను. ఇచ్చట నన్నయ "అని యయాతియష్టకాదులడిగిన వానినెల్ల సంక్షేపరూప మున చెప్పుటయు" అనివ్రాసి తాను బుద్ధిపూర్వకముగ సంక్షేపించినట్లు సూచించెను.

(vi) పాండరాజనపత్యతనుతలంచి దుఃఖించు చుండగ కుంతియాతనికి తనకు దుర్వాసుడిచ్చిన మంత్రము సంగతి సవిస్తరముగా తెలిపినట్లు మూలమునందు న్నది. ఈ వృత్తాంతమంతకు ముందే విపులముగా వర్ణింపఁబడుటచే నన్నయ పునరుక్తిని తొలగించుటకై "కుంతిభోజునింటతనకొండుక నాడు దుర్వా సుడిచ్చినమంత్రంబు తెఱంగుపతికెఱిగెంచె" నని సంక్షేపించెను.

(v) అర్జునుడు గురుదక్షిణగా ద్రుపదనికట్టిద్రోణునికడకు తీసికొనివచ్చినప్పుడు వారిరువురికిని జరిగిన సంభాషణము మూలమున విపులముగా నున్నది. నన్నయ దానినంతను సంగ్రహించి 'వీరెవ్వరయ్యద్రుపదమహారాజులె' అను అమూలకమైన పద్యమును వ్రాసి ఆ సంభాషణమునంతను చక్కగ సంగ్ర హించెను.

(vi) సభాపర్వమున మయుడుండగనే కృష్ణుడు పాండవులను వీడ్కొని ద్వారక కరిగెనని రెండవయధ్యాయమున వర్ణింపబడినది. నన్నయ ఆ యధ్యాయము నంతను "అంతనారాయణుండును పాండవుల వీడ్కొని పితృదర్శన లాల సుండై ద్వారవతీపురంబున కరిగె"నని ఒక్క వాక్యములో సంగ్రహించెను.

(vii) రాజసూయయాగ సందర్భమున ఏ ఏ రాజులు వచ్చి ధర్మరాజును సేవించిరో నాల్గవ అధ్యాయమున పది శ్లోకములలో చెప్పఁబడినది. నన్నయవారినామము లన్నియు విడిచి "అభ్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్" అని ఒక్క సమానము వ్రాసి ధర్మజుని గొల్చిన రాజుల అపరిమితత్వమును కూడ చక్కగా వెల్లడించెను.

(viii) సభాపర్వమునందలి ఏబదినాల్గవ అధ్యాయమున శకునితో జూదమాడుచు ధర్మరాజొక్కొక్క వస్తువునే పణముగానొడ్డి దానిని వరించి "తేన దీవ్యాం మ్యహంత్వయా"అని వలుకుచుండుటయు, శకుని "జితమిత్యేవ శకునిర్యు ధిష్ఠిరమభాషత" అని వలుకు చుండుటయు పెక్కుసార్లు కనఁబడును.

నన్నయ ధర్మరాజొడ్డిన వస్తువులనన్నిటినొక్కచోటనే పేర్కొని "ఒక్కొక్క యొడ్డోననయొడ్డి యోటువడిన"అని మూలమునందలి పునరుక్తిని తొలగించెను.

(ix) అరణ్యపర్వమున ధౌమ్యుడు ధర్మజునకు చెప్పెనని వైశంపాయనుడు జనమేజయున కష్టోత్తర శతసూర్యనామములు తెల్పియుండెను. నన్నయ ఆ నూట ఎనిమిది నామములను తెల్పక "సూర్యుదర్యముండు భగుండను నివి మొదలుగాఁగల నామంబుల అష్టోత్తరశతంబు విధి యుక్తముగా నుపదేశించె" నని సంక్షేపించెను.

(x) నలోపాఖ్యానమున నలుడు దమయంతి కడకరిగి దౌత్యము నిర్వహించి వచ్చిన పిమ్మట దేవతలడుగగా తానంతఃపురము ప్రవేశించుటాదిగాఁగల వృత్తాంత మంతయు వివరించెను. నన్నయ అదంతయు విడిచి "ఇంద్రాదులు నా స్వయంవరమునకు వచ్చెదరేని వారి సన్నిధిన నిన్ను వరించెద, అట్టయిన నీకు నిర్దోషత్వంబగు"నని దమయంతి అన్న మాటలు మాత్రము తెల్పెను.

(xi) ధౌమ్యుడు ధర్మరాజునకు నాలుగు దిక్కులనున్న తీర్థాదులను సుమారు వంద శ్లోకములలో నాలుగధ్యాయములందు వర్ణించి చెప్పెను. ఇట్టి దీర్ఘవర్ణనములు కథాగమనమున కడ్డుగలిగించి పాఠకులకు విసువు కలిగించునని నన్నయ దాని నంతను

నాలుగు దిక్కులందును వినన్ విదితంబగుచున్న పుణ్యతీ
ర్థాలి తెఱంగెఱుంగఁగ మహాత్ముడుధౌమ్యుడజాతవైరి కం
దోలిన చెప్పుచున్నతఱి నొప్పఁగరోమసుదేగుదెంచె

నని రెండు పాదములలో చెప్పివైచెను. నన్నయ సంగ్రహీకరణమునకిది మంచి యుదాహరణము.

(xii) ఆరణ్యపర్వమునందలి నూటయెఱువది మూడవ యధ్యాయమున అర్జునుడు తానొనర్చిన తపస్సును శివునితోఁగావించిన యుద్ధమును ధర్మజునకు విపులముగా వర్ణించిచెప్పెను. నన్నయ యిందలి పునరుక్తిని అర్జునుని ఆత్మశ్లాఘా దోషమును తొలగించుటకై యీ వర్ణనమును చాలవఱకు తగ్గించెను.

సి) నన్నయ పెంచిన భాగములు :

నన్నయ కొన్నిచోట్ల మూలమునలేని వర్ణనములు చొప్పించెను. కొన్నిచోట్ల అమూలకములైన భావములను వ్యక్తముచేసెను. కొన్నిచోట్ల మూలమునఁగల యొక

పదమునో పదసమూహమునో ఆధారము చేసికొని యందలి భావమును విపులీకరించెను. కొన్ని చోట్ల మూలమునలేని యుపమార్థాంతరన్యాసములను కల్పించి వ్రాసెను. కొన్ని చోట్ల వ్యక్తి వస్తువర్ణన విషయమున మూలమునలేని విశేషణములను అధికముగా వాడియుండెను.

(i) అమూలక వర్ణనములు :

ఉదంకుడు మూలమున ఐరావతఫణి రాజులను, తక్షకుని మాత్రమే ప్రస్తుతించి యుండెను. నన్నయ యీ సందర్భమున సర్వశ్రేష్ఠులైన అనంతవాసుకులను కూడ ఈ విధముగా స్తుతించియుండెను.

బహువన పాదపాద్రికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభరము జస్ర ఫణాళిఁదాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁడనంతుఁడు మాకుఁబ్రసన్నుఁడయ్యెడున్
అరిది తపోవిభూతి నమరారుల బాధలు పొందకుండఁగా
సురగుల నెల్లఁగాచిన మహోరగనాయకుఁడానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచి శోభితపాదున కద్రినంద నే
శ్వరునకు భూషణమైన వాసుకి మాకుఁబ్రసన్నుఁడయ్యెడున్.

విశ్వకర్మ పాండవులకొఱకు నిర్మించిన ఖాండవప్రస్థ (ఆది 8-71-79) పురమును నన్నయ పదిపద్యములలో వర్ణించెను. ఇందలి రెండు మూడు భావములు మూలమున కూడ నున్నను ఈ పదిపద్యములును నన్నయ కల్పితములే. అందలి రెండు పద్యములు మాత్రముదాహరింపఁబడు చున్నవి.

అలఘు తరంబులై యహీనహారి సుధారుచి నిందురోచిరా
కుల శశికాంతవేది పృథు కుంజ గళజ్జల నిర్ఝరంబులన్
విలసిత జాహ్నవీవిమల వీచి విలోల లసత్పతాకలన్
బొలుపగుఁదత్పురీభవనముల్ హిమశైలముఁబోలి యున్నతిన్ 8-27
పరిఘ జలంబులం దలంఘు పంకరుహోత్పలకైరవాది సుం
దరకుసుమంబులున్ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం
తరకుసుమంబులున్ వెలయుఁదతుర్పవప్రము పాదపీఠికా
శిరముల్కొప్పనర్చనలు చేసిన పువ్వులచుప్పిదంబునన్ 8-76

ఈ పురవర్ణనము వైశ్యులను, కామినులను, విప్రులను వర్ణించుచు తరువాత ప్రబంధములందారంభములఁగనవచ్చు పురవర్ణనములకాదర్శమై హృద్యముగను ప్రౌఢముగను గంభీరముగను విలసిల్లుచున్నది.

గరుడోపాఖ్యానమున కద్రూవినతలును ఉచ్చైశ్శ్రవమును చూడనరిగినప్పటి సముద్రవర్ణనమును, పాండురాజుమరణమునకు ముందున్న వసంతవర్ణనమును అమూలకములే.

సభాపర్వమున సోదరులు నల్దెసలను జయించి వచ్చినపిమ్మట నాప్తమంత్రులు ప్రేరేప ధర్మరాజు రాజసూయయాగము నాచరింపనుత్సహించెను. ఆ సందర్భమున మూలమునలేకపోయినను ఆప్తమంత్రులు వివరించిన కోశసమృద్ధిని నన్నయవచనము హృద్యముగా వర్ణించెను. (సభా-1-272).

అరణ్యపర్వమందలి కిరాతార్జునీయ వృత్తాంతమున కిరాతుడు శివుడే అని యెఱింగిన పిమ్మట నర్జునుడాతని తనయపరాధమును మన్నింపుమని వేడుకొన్నట్లు మూలమున నాలుగు శ్లోకములున్నవి. నన్నయ ఆ శ్లోకములందలి భావము వెల్లడించినపిమ్మట శివస్తుతి పూర్వకమైన ఒక దండకమురచించెను. ఇది నన్నయ స్వకపోల కల్పితము. తెలుగునందలి ప్రథమదండకమిదే.

ధర్మరాజు నహుషుని ప్రశ్నలకు సమాధానము లొసంగి భీమునితో ఆశ్రమమునకు తిరిగివచ్చెను. అనంతరము ధారాశుద్ధి శోభితములైన హృద్యపద్యములతో కూడిన వర్షాశరత్కాలవర్ణనమున్నది. ఈ వర్ణనము నన్నయ స్వయముగా కావించినదే.

ii అమూలక భావములు:

శంతనుడు యోజనగంధిని చూచి మన్మథవికారమునకు గుఱియయ్యెను. అప్పుడునన్నయ ఆమె సౌందర్యమును వర్ణించుచు ("దానిశరీర సౌరభము దాని విలోల విలోకలంబులున్" ఇత్యాదిగా) నొకపద్యము రచించెను. (ఆది 4-172) లక్షాగృహదహనానంతరము ప్రాతఃకాలము జనులచ్చటి కరుదెంచి పాండవులేదగ్ధులైనట్లు తలంచి దుఃఖించిరని నన్నయ యొకపద్యము వ్రాసెను (బలవంతుల్ భదతా స్వయస్థితికరుల్-ఆది-6-167) ఖాండవ వనదహనమునకు ముందు తెలుగు భారతమున ఘర్మసమయమునువర్ణించు నొకపద్యమున్నది. (ఉరుతర దావపావక శిఖోత్కలితశ్వసనంబులున్-ఆది-8-230) ఆఘర్మ సమయమును సహింపనోపకయే అర్జు

నుడు యమునానదీతీరమునకు విహరింపనేగుదమని కృష్ణుని ప్రేరేచెను. సభాపర్వము న నారదుడు బ్రహ్మసభనుధర్మజునకు వర్ణించిచెప్పుచు (దీపితసత్యసంధుడుః ధృతిస్మృతి ధర్మపరాయణుండు-సభా-1-84) అను పద్యమున హరిశ్చంద్రుని మహిమాతిశయమును వివరించెను. రాజసూయయాగ సందర్భమున కృష్ణుని అర్ఘ్యగ్రహణార్హతను తెల్పుచు భీష్ముడు "వృద్ధలోకలక్షయున్నను" "పూజితులతృప్తులగుదురు" (సభా-2-27,28) అని రెండు కందపద్యములు చెప్పెను. హంసవలన నలదమయంతులు పరస్పరగుణరూపముల నెఱింగినపిమ్మట మనఃప్రభవానల బాధ్యమానులై తాపోపశమనమునకై యేమిచేసిరో వర్ణించుచు (నలదమయంతులిద్దరు మనఃభవవానల బాధ్యమానకై-అరణ్య-2-24) అని నన్నయ సుప్రసిద్ధమైన పద్యమువ్రాసెను. ఈ పద్యములందలి భావములన్నియు సమూలకములే. ఇట్లే మూలకమునలేని భావములను సమయోచితముగా కల్పించి నన్నయ వ్రాసినపద్యము లనేకములున్నవి.

iii పదములను పదసమూహములను ఆధారముగాఁగైకొని పెంచిన భాగములు :

దుష్యంతోపాఖ్యానమున మేనక విశ్వామిత్రుని ఆశ్రమమునకరుగు సందర్భమున ఇంద్రుడు వాయువు నావేశించినట్లును, ఆమె వాయువుతోఁగూడ బయలుదేరి వెళ్ళినట్లును మూలముననున్నది. నన్నయ

"చల్లని దక్షిణమారుత మల్లన నెతెంచిఁదగిలి యా లలనా ధ
మ్మిల్ల కుసుమాంగరాగ సముల్లసన సుగంధియగుచు మునివరుమీఁదన్"

అని మలయమారుతము వీచిన విధమును చక్కఁగా వర్ణించెను.

భృగమహర్షి తన్ను శపించినపుడు అగ్ని తాను ప్రతిశాప మీఁగలిగియు నట్లొనర్పకుండుటకు "మాన్యాస్తుబ్రాహ్మణామమ" అని కారణము తెలిపెను. నన్నయ ఆ కారణమును

"అడిచినఁదిట్టినన్ మఱి మహాపురుషంబులు పల్కఁ యల్కఁతోఁ
బొడచిన నుత్తమ ద్విజులు పూజ్యులు వారలకెగ్గు చేసినన్
జెడు నిహముం బరంబునిది సిద్ధము గావు పెరింగి భక్తి నె
ప్పుడు ధరణీసురోత్తములఁ పూజలఁదన్పుదు నల్గ నోడుదున్"

అను పద్యమున విశదీకరించెను.

దేవయాని సంతానము కన్నపిమ్మట సంప్రాప్త యౌవనయైన శర్మిష్ఠ "ఋతుకాలస్య సంప్రప్తోనచ ఽస్తి పతిర్వృతః" అని దుఃఖించినట్లు మూలమునున్నది. ఆమె దుఃఖించిన విధమును నన్నయ

"అసదృశయౌవనం ఓదియనన్య ధనంబగు నొక్కొ నాకు ని
క్కుసుమ సముద్భవంబును నగోచరదుర్గమ దుర్గవల్లికీ
కుసుమ సముద్భవంబగు నొకో పతిలాభము లేమిఁజేసి యొ
ప్పెసఁగఁగ దేవయానిపతి నేమి తపంబొనరించికాంచెనో"

అను పద్యమున విపులముగా వర్ణించెను.

అర్జునుడు ద్వాదశమాసికవ్రతము సల్పుసందర్భమున కళింగదేశమహేంద్ర పర్వతములనుచూచి సముద్రతీరమువెంట మణలూరు పురమున కరిగెనని తెల్పి సంస్కృతభారతమతడు గోదావరిలోఁగూడ స్నానముచేసెనని "గోదావర్యాం తత స్నాత్వా"అను చిన్నవాక్యములో తెల్పెను. ఆ చిన్నవాక్యములను పురస్కరించుకొని నన్నయ తన ప్రభువయిన రాజరాజనరేంద్రుడు పాలించు వేగీదేశముయొక్క విభవము నీక్రిందిసీసమున విపులముగావర్ణించెను. "దక్షిణగంగనాఁదద్దయునొప్పిన గోదావరియు జగదాదియైన భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వర నిధాన పుణ్య సమృద్ధమై పొలుచు వేంగీదేశవిభవంబుఁజూచుచు ........ ఈ సీసము నన్నయ్య స్వదేశాభిమానమును చక్కగా ప్రకటించుచున్నది.

సభాపర్వమున శిశుపాలుడు కుపితుడై సభవీడి వెడలిపోవునప్పుడు ధర్మజుడా తని శాంతింపఁజేయుచు వెంటనరిగి "వేదతత్త్వేన కృష్ణంహి భీష్మశ్చేదిపతేఖ్యశ" మ్మని చెప్పినట్లు సంస్కృతభారతమునఁగలదు. దానినాధారముగా చేసుకొని నన్నయ

"ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబునకాస్పదమైనవాఁడు, వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు, లో
కాది, త్రిలోకపూజ్యుఁడని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁజెప్పెఁబూజ్యుఁడని యుక్తమ కాకిదియేమి దోసమే"

అను పద్యమున నందలి భావమును చక్కగా విశదీకరించెను.

ఋతుపర్ణుని పురమున వార్ష్ణేయజీవలులతో నివసించు నలుడు సాయంసమయమునందు.

"క్వాసు సాక్షాత్ పిపాసార్తా శ్రాంతాశేతే తపస్వినీ,
స్మరంతీ తస్యమందస్య కంవాసాఽద్యోపతిష్ఠతే"

అని దమయంతిని గూర్చి స్మరించుచున్నట్లు సంస్కృతభారతమునందున్నది. ఆ శ్లోకమందలి భావమునే నన్నయ, "ఇభరాజగమన నీవెందులకరిగితి" ఇత్యాది సీస పద్యమున (అరణ్య, 2-132)కరుణరసమయముగను, విపులముగను వర్ణించెను.

iv అలంకారికమైన పెంపు :-

నన్నయ సంస్కృతము నలంకారరహితతములై విషయమాత్రప్రతిపాద కములయిన శ్లోకములను సాలంకారములుగా సంతరించి పౌరాణికమైన సరళశైలికి కావ్యోచితమయిన ప్రౌఢిమకలిగించిన సన్నివేశములనేకములున్నవి.

శమంతకాక్షౌహిణీ కథన సందర్భమున మూలమందు "క్షత్రియాన్ రామ శ్శస్త్రభృతాంవరః జఘునామర్ష చోదితః" అని చెప్పబడియున్నది. నన్నయ ఆ యర్థమునే రూపకాలంకారముతోఁగూడిన క్రిందిపద్యమున వ్యక్తము చేసియుండెను

త్రేతా ద్వాపరసంధి నుద్ధతమందాదీభూత విద్వేషి జీ
మూతోగ్రశ్వసనుండు, రాముఁడలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁజంపెం బల్విరన్ దీర్ఘని
ర్ఘాతక్రూర కుఠారలూన నిఖిలక్షత్త్రోరుకాంతారుఁడై,

శుక్రునుదరమందున్న కచుడు సంజీవన్యుపదేశమును పొందిన యనంతర మాతని యుదరము చీల్చుకొని బయటికివచ్చెను. అప్పుడాతడు దయ్యాది దరీముఖ మున నుదితుండగు పూర్ణహిమమయూఖునివలెనుండెనని నన్నయ వర్ణించెను. పిదప విగతజీవుడై పడియున్న శుక్రుడాతనిచే సంజీవితుడై వెలుగొందెను. అప్పుడతడు చ్చారణ దీక్షచేత నభిహితమగు శబ్దమువలె నుండెనని నన్నయ వర్ణించెను. ఈ రెండు పమానములును నన్నయ కల్పించినవే.

సభాపర్వమున పాండవులు మయసభాసీనులై యుండ వారిని చూచుటకై నార దుడు వచ్చెనను సందర్భమున సంస్కృతమందు 'నారదస్సుమహాతేజాః ఋషిభి స్సహితస్సదా లోకాననుచరన్ సర్వానాగమత్తాం సభామృషిః' అని చెప్పబడినది ఇందలి సుమహాతేజాః అను విశేషమును నన్నయ

"నీరజ మిత్రుఁడేల ధరణీగతుఁడయ్యెడు నొక్కొ యంచు వి
స్మేర మనస్కులై జనులుమెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా
నారదుఁడేగుదెంచె గగనంబుననుండి........" సభా (1-22)

అని ఉత్ప్రేక్షాలంకారపూర్వకముగా పెంచి నారదుని సూర్యసమతేజమును వ్యక్తము చేసెను.

నలోపాఖ్యానమున 'చనుచయిట్టిపాటఁబెనుపఱి యెవినీతు సిరియుఁబోలె నడగి విఱిసి చనియె' ననియు 'ఉరుతరసార్ద్రపయోరాశిహాస్తియూధాగస్త్యుచేఁభీతమయ్యె మఱియు' అనియు నన్నయవాడిన ఉపమారూపకాలంకారములు రెండును అనూలకములే.

నలుడుద్యానవనమున విహరించుచుండగా గాంచిన హంసలు జాతరూప పరిచ్ఛదములని మూలమున చెప్పఁబడినది. నన్నయ యావిశేషణమును విడిచి "అంతరిక్ష శ్రీ కాంతా హారావళియులబోలె హంసావళి అవనీతలంబున కవతరించిన (అర. 2-11)" అని వ్రాసి రూపకముతోకూడిన చక్కని ఉపమానమును కల్పించెను. నలుడాహంసలలో నొక దానిని పట్టుకొనగా మిగిలిన హంసలు దానిని విడువలేక ఆకసమున తిరుగుచుండెను. ఈ సందర్భమున నన్నయ హంసల ఆకారమునేకాక ఐక్యమత్యమును, మనస్తత్వమును కూడ ప్రకటించుచు సుందరమైన ఉపమాలంకారముతో కూడిన క్రింది పద్యమును రచించెను.

> దానివిడచిపోవఁగానోపకఱచుచు నంతరిక్షమునను హంసలెల్లఁ
> బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూతశారదాభ్రశకల చయముఁబోలె.
> (అర 2-13)

ఇట్లే నన్నయ పెక్కుచోట్ల మూలమున లేకున్నను అర్థాంతర న్యాసాలంకారములను కల్పించి చొప్పించెను. వానిలో రెండు మూడిచ్చట సూచింపఁబడుచున్నవి.

> గురుకార్య నిరతులగు సత్పురుషలకగు టరుదెయధిక
> పుణ్యఫలంబుల్ (ఆది 1-119)
> పెద్దలచరితం బల్పులకునెఱుఁగ శక్యమె యెందున్. సభా. (2-19)
> కడుకొని చేయకుండునె జగన్నుతః గర్వము దుర్విమోహమున్
> సభా (1-31)
> ఎందుగుడిచిన చోటికినెగ్గ చేయరెంత దుర్జనులైనను నెఱుక విడిచి.
> అరణ్య (3-390)

**(v)** వ్యక్తి వస్తు విశేషణములచే కావించిన పెంపు :

సాధారణముగా నన్నయ వ్యక్తులను ప్రథమమున ప్రవేశపెట్టునపుడు వారి శీల స్వరూపములను పఠితలకు వ్యక్తముచేయు విశేషణముల నెన్నో వాడుచుండును.

జనమే జయః పారిక్షితః-అనగా పరీక్షిత్తు కుమారుడైన జనమే జయుడని అర్థము. దీనిని నన్నయ

ప్రతిహతశత్రు విక్రముఁడు పాండవ వంశవివర్ధనుండు సు
వ్రతుడు పరీక్షితాత్మజుఁడ వద్యా విదూరుఁ డుదారకీర్తి ని
ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁడన్ జనపాలుఁడుత్తమ
స్తుతమతిదీర్ఘసత్ర మజితుండొనరించె శుభాభికాంక్షియై (ఆది. 1-82)

అను పద్యమున పెక్కు విశేషణములతో పెంపొందించెను.

అమరనది దేవవ్రతుని తెచ్చి శంతనునకిచ్చు సందర్భమున నన్నయ "ఆత్మవిజ్ఞానంబునందు సనత్కుమారాదులయట్టిఁడ యనఘమూర్తి" యని యాతని గుణగణములు వర్ణించెను. శాంత్యనుశాసన పర్వములలో ప్రకటితమగు భీష్ముని విజ్ఞాన విశేషమును బట్టిచూడ నిచ్చట నన్నయ వాడిన విశేషణమెంత ఔచిత భాసురమో వ్యక్తమగును.

"ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః సవ్యమూరుమదర్శయత్" అను మూలము నందలి వాక్యమును విశేషణములతో పెంచి నన్నయ" అమ్ముదితన్ వినీత హరిణాక్షిఁ గలాప విభాసి కేశభారమ్మున నొప్పుదాని......." (సభా 2-247) అను పద్యమునందు వివరించెను.

"ఆజగామ మహాయోగీ వ్యాసస్సత్యవతీసుతః" అనగా మహాయోగియు, సత్యవతీ సుతుడునైన వ్యాసుడు వచ్చెనని యర్థము. నన్నయ

క. వారల పుణ్యోదయమున
వారిజ భవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెన్
బారాశర్యుఁడు ధర్మశ
రీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్. (అర. 1.272)

అను పద్యమును వ్రాసి వ్యాసునికి మఱికొన్ని విశేషణములు చేర్చెను.

**(d)** నన్నయ చేసిన యన్యథాకల్పనలు :

నన్నయ కొన్ని కథాంశములను మూలమునందున్న వానినున్నట్లుగా వ్రాయక ఇంచుక మార్చి ఔచిత్యమును పోషించుటకు యత్నించెను. ఇట్టివాని సంఖ్య యతి స్వల్పము. నన్నయగ్రహించిన ప్రతిలో నట్లుండెనో, బుద్ధిపూర్వకముగా నతడట్లు మార్చెనో తెలియరాదు.

(i) గరుడోపాఖ్యానమున మూలమున శౌనకాదులడుగగా వాలఖిల్యులింద్రుని శపించిన వృత్తాంతమును సౌతివారికి చెప్పినట్లు కలదు. నన్నయ గరుడుడు వచ్చుటకు ముందు స్వర్గమున కల్గిన ఉత్పాతములకు హేతువు తెల్పుచు బృహస్పతియే ఆ వృత్తాంతము నింద్రునకు చెప్పినట్లు వ్రాసియుండెను. ఈ సందర్భమున ఆ వృత్తాంతమును బృహస్పతిచే చెప్పించుటయే ఉచితతరముగా నున్నది.

(ii) ఉదంకోపాఖ్యానమున తక్షకునివెంట నాగలోకమునకేగిన ఉదంకుడు దివ్య పురుషునిగాంచి నాగకులమెల్ల తనకు వశమగునట్లు చేయుమని ప్రార్థించెను అప్పుడతడు "ఏతమశ్వమపానే ధమస్వ" అని చెప్పినట్లు మూలమందున్నది. ఉదంకుని వంటిముని అశ్వాపానమున నూదుట అసభ్యముగా నుండునని నన్నయ "దివ్యపురుషుండుదంకుని" "నీయశ్వకర్ణా ధ్మానంబు చేయుమని" యాదేశించినట్లు మార్చి వ్రాసెను.

(iii) శర్మిష్ఠయు దేవయానియు వనమున క్రీడించుచుండ వాయుభూతుడైన ఇంద్రుడే వారి వస్త్రములను కలచివేసినట్లు సంస్కృతమున నున్నది. ఇంద్రుడంత వాడట్లుచేయుట యుక్తముగా నుండదని నన్నయ యావస్త్రములు "సురకరు వలిచేతం బ్రేరితంబులై కలసి"నట్లు మార్చి వ్రాసెను.

(iv) పాండురాజు మాద్రిని వివాహమాడు సందర్భమున మూలమందు "పాండో రర్థే పరిక్రీతా దనేనమహితా తథా "అని యామె పాండురాజు కొఱకు అధిక మైన ధనముచేకొనఁబడినట్లు మూలమందున్నది. 'పరిక్రీతా' యనుట ఉచిత ముగా లేదని తోచుటచేకాబోలు నన్నయ దానిని విడిచి" మఱియు మద్రరాజ తనయమాద్రియకు దాని మహోత్సవంబుఁబాండురాజు వివాహమాడెన"ని వ్రాసియుండెను.

(v) కుంతి పాండురాజు ననుమతిచే దుర్వాసుడు తన కొసగిన మంత్రము ప్రభావ మున ధర్మజాదులను కనెను. మాద్రి యది చూచి పాండురాజుతో రహస్య ముగా "గాంధారికి వందమంది పుత్రులు పుట్టిరి, కుంతికి ముగ్గురు పుత్రులు పుట్టిరి, మొదటిదానికంటె రెండవది నాకెక్కువ దుఃఖతరముగానున్నది. ఏలయన కుంతినాకుసవతి నాతో సమానురాలు. ఆమెకు కొడుకులుండుటయు, నాకు లేకపోవుటయు లాఘవమునకు కారణము. నీవు నాయెడ ప్రసన్ను

డవైనచో నాకుకూడపుత్రులుదయించునట్లు ఆమెను నియోగింపుము" అని పల్కినట్లు సంస్కృత భారతము నందున్నది. ఈ భాగమున మాద్రికినంతా నము లేకపోవుటవలన కలిగిన మాత్సర్యమే ఎక్కువగా వ్యక్తమగుచున్నది. నన్నయ మాద్రిదుఃఖమునకు "సంసారసుఖావహమైన సత్పుత్రజన్మము కలుగక పోవుటయే కారణమని తెల్పుచు, మాతృత్వమున నామెకుగల అభిలషణను ప్రకటించుచు, ఈ క్రింది పద్యమును వ్రాసెను.

"కోరిన కోర్కికిం దగఁగఁగుంతి సుతత్రితయంబుగాంచెగాం
ధారియు నక్కడన్సుతశతంబు ముదంబొనరంగఁగాంచెనేఁ
బోరచియాడుఁబుట్టువునఁబుట్టి నిరర్థకజీవనైతినం
సారసుఖావహంబయిన సత్పుత్రజన్మముగానఁబోలమిన్"

(vi) ద్రోణుడర్జునునకు చీకటిలో నెన్నడునన్నము పెట్టవద్దని సూదునితో చెప్పినట్లు మూలమున నున్నది. అందుకర్జునునికి చీకటిలో బాణములు ప్రయోగించునేర్పులవడకుండ వలయుననియే అతని యుద్దేశము. ద్రోణునికి అర్జునుని యెడ అట్టిసంకుచితభావమెప్పుడును లేనికారణమున నన్నయ మార్చి అశ్వత్థామయట్లు చెప్పెనని వ్రాసెను. అశ్వత్థామ కర్జునుని యెడ నట్టి అసూయ ఉన్నదన్నచో ఆశ్చర్యము లేదు.

(vii) సహదేవుడు దక్షిణదిగ్విజయ యాత్రచేసిన సందర్భమున మాహిష్మతీ పురమునందు అగ్నిపారదారికుడై శిక్షింపబడిన వృత్తాంతము మూలమున చెప్పబడినది. అగ్నిబ్రాహ్మణ రూపమున మాహిష్మతీపురమున కెందుకరిగెనో అందు తెల్పబడియుండలేదు. పాఠకులకు పారదారికత్వమే అందుకుకారణమైనట్లు తోచును. నన్నయ "జాతవేదుండు విప్రుండై వేదాధ్యయనము చేయుచు మాహిష్మతీపురమున నుండి ప్రమాదవశంబున పారదారికుఁడయ్యె"నని చెప్పియుండెను. ఇది యాకాలమున అగ్నియంతవానికి గూడ వేదములుబోధింపఁజాలు బ్రాహ్మణులు మాహిష్మతీపురమునందుండిరనియు ధీమంతులు కూడ నొక్కొక్కప్పుడు ప్రమాదమునకు గురియగుచుందురనియు సూచించుచున్నది. మఱియు మూలమున ఆపట్టణమునందలి స్త్రీలు స్వైరిణులైయుండ వచ్చునని అగ్నియే వరమిచ్చినట్లున్నది. నన్నయ అట్లుకాక అగ్నిరాజున

కాతడు కోరిన వరమిచ్చి దానికి ప్రతిప్రియముగా నానగరమునందలి స్త్రీలు మిక్కిలి మనోజరాగిణులు కావున వారల స్వైరిణీవృత్తి నహింపవలెనని యడిగినట్లు వ్రాసియుండెను. అగ్ని స్త్రీలకు తానే వరమిచ్చెననుట కంటె రాజుచే నిప్పించెననుట యుక్తతరముగానున్నది.

(viii) భీముడును జరానంధుడును పోరుసందర్భమున మూలమున బలి ఇంద్రునివలె జరాసంధుడు భీమునితాకెనని యున్నది. బలిశక్రులయుద్ధమున బలియే జయించియుండుటచే నిచ్చటి యుపమానము భీమభవిష్యజ్జయ సూచకముగా లేదు. అందుచే నన్నయ క్రమమును మార్చి "పోరిరూర్జిత భుజదర్పమేర్పడఁగ సింహగజేంద్రములట్లు, వజ్రపర్వతములయట్లు, ఘోరతర వానవవృత్రుల యట్లు నిద్దరున్" అని వ్రాసియుండెను. ఈ క్రమము ఉచితమై భీముని భావి విజయమును సూచించుచున్నది.

(ix) సభాపర్వాంతమున పాండవులు అడవికేగునపుడు నకులుడు పాంశూపలిప్త సర్వాంగుడును, నహదేవుడాలిప్తముఖుడునై ఏగిరని సంస్కృతమున వర్ణింపబడినది. నన్నయ సహదేవు డధోవక్త్రుడై ఏగినట్లు వర్ణించెను. వారట్లేగుటకు చెప్పబడిన కారణములు మూలమునకంటె తెలుగున ఉచితతరములుగా నున్నవి. నకులుడు పాంశూపలిప్త శరీరడగుటకు మార్గమునందలి వనితల హృదయమాతని సౌందర్యముచే నాకర్షింపబడునేమో అను సందేహము మూలమున కారణముగా చెప్పబడినది. ఇది కొంచెమసభ్యముగా నుండుటచేతను, ఆ సమయమందుకనువైనది కాకపోవుటచేతను నన్నయ "దుఃఖానుభవంబున కనుచితంబైన తమ సుందరరూపము చూచి జనులు దుఃఖింపకుండ దూళిధూసరిత శరీరుడైన నకులుఁడరిగె"నని మార్చి వ్రాసెను. సహదేవుడాలిప్త ముఖుడగుటకు ఎవ్వరును తన్ను గుర్తింపకుండ వలెనను ఆతనికోరికయే కారణమని మూలమున చెప్పబడినది. "దీనంబైన తన యాననంబు చూసిన వారికెల్ల నెగ్గగునని నహదేవుడవనత వదనుండై యరిగి"నట్లు నన్నయ కారణము చెప్పియుండెను.

(x) అరణ్య పర్వమున నింద్ర సురభి సంవాదము కలదు. అందు సురభి బలముగల బలీవర్దములతో బలహీనములైన వానిని పూన్చి జనులు దున్నుచుండుటచే బలహీనములైనవి బాధ పడుచుండుట చూచిన తనకు దుఃఖము కలుగుచున్నదని చెప్పివాపోయెను. ఇంద్రుడంత హెచ్చుగా వర్షము కురియించి

కర్షకులకు విఘ్నమాచరించెనని మూలమందు చెప్పబడినది. ఇంద్రుడు బల హీనములైన ఎద్దులకు దౌర్బల్యముడిగింపవలెనుగాని ఒక్కమారు వర్షము కురి యించి లాంగలాకర్షణమునకు విఘ్నమాచరించుట వలన నేమిలాభము? అందుచే నన్నయ ఇంద్రుడు వర్షంబున తృణవర్ధనంబు కావించి దుర్బల బలీ వర్దములకు బలము కలిగించెనని వ్రాసియుండెను.

(xi) అర్జునుడు నివాత కవచులతో పోరునపుడు వారు తమ అస్త్రములన్నియు వ్యర్థములుకాగా చివరికి తిమిరాస్త్రమును ప్రయోగించిరనియు అప్పుడు భయ పడుచున్న మాతనినర్జునుడూరడించి మోహినియను అస్త్రమాయను ప్రయో గించెననియు మూలము నందున్నది. తిమిరబాణ ప్రభావమును మాపుటకు అస్త్రమాయకాక సూర్యబాణమేయుట యుచితముగా నుండునని నన్నయ అట్లు మార్చి వ్రాసియుండెను. ఈ విధముగా నన్నయ ఔచిత్య పోషణమునకై మార్చిన నన్నివేశము లింకను పెక్కున్నవి.

(e) మూలమును యథాతథముగా ననువదించిన భాగములు :

పైని చెప్పబడిన విషయములను బట్టి నన్నయ మూలమును పెంచుటయో, తగ్గించుటయో, మార్చుటయో తప్పక చేయుచుండెనని భావింపరాదు. అతడు మూలమును యథా తథముగా ననువదించిన చోట్లు అనేకములున్నవి. కొన్నిచోట్ల నతడు మూలమునందలి పదములను కూడ ఉన్నవాని నున్నట్లే గ్రహించి యుండెను.

(i) "బిభీషికైషా గంధర్వ నాస్త్రజ్ఞేషు ప్రయుజ్యతే
అస్త్రజ్ఞేషు ప్రయుక్తైషా ఫేనవత్ప్రవిలీయతే"
"వెడఁగ యిట్టిపాటి వెఱపించుటలును మాయలును నేమిచేయు నస్త్రవిదుల
బెక్కులయు నీబిభీషికల్ నుఱువులు విఱియునట్లు విందు విఱియుఁజూవె."
(ఆది 2-43)

(ii) "అగ్నిహోత్రఫలావేదా దత్తభుక్తఫలంధనమ్
రతిపుత్ర ఫలాదారాః శీలవృత్త ఫలంశ్రుతమ్."
"దారసంగ్రహంబు ధరణీశ! రతిపుత్ర
ఫలము, శీలవృత్త ఫలము శ్రుతము
దత్త భుక్త ఫలము ధనము వేదము లగ్ని
హోత్ర ఫలము లనియు నొగి నెఱుంగ" (సభా 1-51)

(iii) "తావుభౌ సహితౌ వీరౌ జరాసంధశ్చ వీర్యవాన్
త్రయస్త్రయాణాం లోకానాం పర్యాప్తా ఇతిమేమతిః"
"భూమీశ! హంస డిభకులు
నామగధాధీశ్వరుండు సమ్మువ్వురు ను
ద్దామ భుజ వీర్యసంపద
తో నూఁడు జగములు నోపుదురు సాధింపన్." (సభా 1.114)

(iv) "అల్పోఽపిహ్యరి రత్యంతం వర్ధమానపరాక్రమః
వల్మీకోమూలజ ఇవగ్రసతే వృక్షమంతికాత్"
"అల్పుఁడయ్యు మనుజుఁడతి పరాక్రమమునఁ
బేర్మిఁదరతరంబ పెరుఁగుచున్న
వాఁడు క్రమాని మొదలి వల్మీకమాత్రమానిఁ
జెఱుచునట్లు గడఁగి చెఱుచుఁబగఱ" (సభా 2.144)

(v) "తతాబ్రువతివాయౌతు పుష్పవృష్టిఃపపాత హ
దేవదుందుభయో నేదుర్వనౌచ పవనశ్శివః"
కురిసెమరుద్వచనానం
తరమున సురపుష్పవృష్టిదడయకవించెన్
సురదుందుభి నాదంబులు
కరముప్రసన్నుఁడయివీచె గంధవహుండున్" (అర.2.27)

(vi). "యుధిష్ఠిరధృతిర్దాక్ష్యం దేశకాల పరాక్రమః
లోకతంత్ర విధానానామేష పంచవిధోవిధిః"
"ధృతియును, దాక్ష్యంబును, దేశంబును, గాలంబును, బరాక్రమంబును నను
పంచవిధంబులైన లోకతంత్ర విధానంబులెఱింగిన" (అర. 4.32)

ఈ విధముగా నన్నయ అనువాదము ఆదిపర్వమునందు కంటె సభాపర్వము నందును ఆరెండింటికంటె అరణ్యపర్వము నందును మూలమున కెక్కువ సన్నిహిత తరముగా నున్నట్లు కనిపించును. అరణ్యపర్వము నందలి కొన్నిభాగములు కల్పన కెక్కువ తావిచ్చునట్టివి కాకుండుట అందుకు హేతువై యుండును. అతని అను వాదము పద్యములలోకంటె వచనమున మూలమునకు మఱింత దగ్గరగానున్నట్లు

గోచరించును. వచనమున గణయతిప్రాస నిరోధము లేకుండుటయు అందలి వస్తు స్వభావమును అందుకు హేతువై యుండును.

(f) సంస్కృతమునందలి సుప్రసిద్ధకవులందరును నన్నయకు పూర్వమున్నట్టి వారే. వారిలో కొందఱు భారతము నుండియే వస్తువునుగ్రహించి కావ్యనాటకములను వ్రాసియుండిరి. అందుఅభిజ్ఞాన శాకుంతలమును, కిరాతార్జునీయమును, శిశుపాలవధమును, నైషధమును ముఖ్యములైనట్టివి. నన్నయ వానిని పఠించియుండుననుటలో సందేహములేదు. అందుచే ఆగ్రంథములయందలి భావములు కొన్ని జ్ఞాతముగనో అజ్ఞాతముగనో నన్నయ రచనలో ప్రవేశించినవి.

(i) అభిజ్ఞాన శాకుంతలమునఁగల

"అసంశయంక్షత్ర పరిగ్రహక్షమా
యదార్యమస్యామభిలాషి మేమనః." (అభి. శా. 1.27)

అను శ్లోకమునందలి భావము దుష్యంతోపాఖ్యానమునందలి

"ఇది మునికన్యయేని మఱియేలొకో యీలలితాంగి యందు నా
హృదయముదద్దయుం దగిలె నిప్పలుకింకను నమ్మనేరన
య్యేద........" (ఆది. 4.30)

అను పద్యమున ప్రకటింపఁబడినది. ఈ భావము మూలమున లేదు.

(ii) "భవహృదయ సాభిలాషం సంప్రతి సందేహ నిర్ణయోజాతః" అను శాకుంతలమునందలి శ్లోకముయొక్క భావము

"ఇది మునినాథ కన్యయని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్రి నని యుక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిఁగించినన్ మదనబాణ పరంపర కిప్పుడుండె నా
స్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్."

అను పద్యమునందు ధ్వనించుచున్నది.

(iii) అట్లే "ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను బెద్దకాలమునికి తద్ద తగదు-" (ఆది 4-65)

"ఎదుఱను దవ్వులఁ జూచిన పొదవులెల్లఁదక్షణము కదియఁగా" (అర 2.169)

మొదలైన పద్యములకు కూడ శాకుంతలమున మాతృకలున్నవి.

(iv) స్వయంవర రంగమున ప్రవేశించు ద్రౌపది "పుష్పసాయకు కుసుమే తరం బైన అజగు సాయకంబేమో"యను నట్లుండెనని నన్నయ వర్ణించెను. ఇది "కామస్యపుష్పవ్యతిరిక్తమస్త్ర"మ్మను కాళిదాసుని శ్లోకపాదమును స్మరింపఁ జేయుచున్నది.

(v) శకుంతల దుష్యంతునికి తన కుమారుని జూపి "నీ పుణ్యతనువు వలనన యీ పుత్త్రకుఁడుద్భవిల్లి యెంతయు నొప్పున్, దీపంబు వలన కొండొక దీపము పుట్టించినట్లు తేజంబెగన్." (ఆది. 4-83) అని చెప్పియుండెను. ఈ భావము వ్యాస భారతమున లేదు. ఇది "ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్" అను రఘు వంశమునందలి ఉపమానమును పోలియున్నది.

(vi) శిశుపాల వధ కావ్యమున శ్రీకృష్ణుని కడకరుదెంచు నారదుడు పతత్ పతంగ ప్రతిముడుగ వర్ణింపఁబడి యున్నాడు. సభాపర్వమున నారదుడు ధర్మజుని సభ కరుదెంచు సందర్భమున నన్నయ అతని "నీరజ మిత్త్రుఁడేల ధరణీ గతుఁడయ్యెడు నొక్కొ యంచు విస్మెర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతిఁ జూచుచుండఁగా నారదుఁడేగుదెంచె" అని వర్ణించియుండెను. ఈ రెండు వర్ణనలకునుగల సాదృశ్యము వేరుగా చెప్పవలసిన అవసరములేదు.

(vii) కిరాతార్జునీయమునందలి శ్లోకములకు ఛాయలనఁదగిన పద్యములు అరణ్య పర్వమునందనేకములున్నవి.

"వ్రజంతితే మూఢ ధియః పరాభవం
భవంతి మాయావిషు యేన మాయినః
ప్రవిశ్య హిఘ్నంతి శఠా స్తథా విధా
ససంవృతాంగా న్నిశితా ఇవేషవః"

అను శ్లోకమునందలి భావమే ఈ క్రింది పద్యమున కానవచ్చుచున్నది.

"ధర్మ దూరులైన ధార్తరాష్ట్రుల యంద
ధర్మమేమి సేయు ధరణి నాధ
నికృతి పరులయందు నికృతి సేయనివారు
వారి నికృతిఁ జేసి వధ్యులండ్రు." (అరణ్య 1-226)

(viii) నలోపాఖ్యానమున నలుడొక హంసను పట్టుకొనగా నితర హంసలఱచుచు ఆకసమున పిండుకట్టి తిరుగు చుండెనని నన్నయ వర్ణించెను. ఈ సందర్భ మున నైషధ మందు

పతత్త్రి జాత ద్రుచిరేణ వంచితం
శ్రియః ప్రయాంత్యాః ప్రవిహాయ పల్వలమ్
చల త్పదాం భోరుహ నూపురోపమా
చు కూజకూలే కలహంస మండలీ"

అను శ్లోకమున్నది. మల్లినాథసూరి దీనికి వ్యాఖ్య వ్రాయుచు "స్వయాద భ్రంశే. కూజనం పక్షిణాంస్వభావ" అని వివరించి యుండెను. మల్లినాథుడు నన్నయకు తరువాతి వాడగుటచే నీ వ్యాఖ్యను నన్నయ చూచి యుండకపోయినను శ్రీ హర్షుని శ్లోకము ననుసరించియే హంసలు అఱచెనని వ్రాసియుండెను.

**(g)** తమిళకన్నడములందు నన్నయకుముందే భారతములు వ్రాయబడియుండెను. కన్నడమునకును తెలుగునకును సన్నిహిత సంబంధముకలదు. అందుచే ఆరెండు భాషలవారును ఒండొరుల భాషలలో వ్రాయబడిన కావ్యములను చదువుటయో, వినుటయో జరిగియుండెను. అందును కన్నడభాషలో పండితుడైన నారాయణభట్టు నన్నయకు సహాధ్యాయుడును మిత్రుడునగుటచే నన్నయతాను భారతము వ్రాయుటకు ముందు స్వయముగనో అతని సాహాయ్యముతోడనో ఆంధ్రుడయిన పంపడు వ్రాసిన విక్రమార్జున విజయమును చదివియుండును. అందుచే అందలి భావములును పదప్రయోగములును నన్నయ భారతమున ప్రవేశించుట కవకాశమున్నది. కన్నడమున కృతినాయకునికిని, కృతిభర్తకును వీరైనచోట్ల అభేదము చెప్పుసంప్రదాయమున్నది. నన్నయ అట్లుచేసెనని నిశ్చయముగా చెప్పఁజాలము కాని, అతడు జనమేజయ దుష్యంత భరతాదులను వర్ణించిన పద్యములు రాజరాజునకు కూడ అన్వయించునవిగా కన్పించును.

**(i)** నన్నయ "సారమతింగవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో నారసి మేలునాన్" అను పద్యమున తన కవిత్వమునందలి ప్రధానగుణములను పేర్కొనియుండెను. పంపకవియు విక్రమార్జున విజయమునందు "లలితపదం ప్రసన్నకవితాగుణ మిల్లదెపూండు పేటిబెళ్ గళకృతి బంధముం" అని తనకవిత్వమునందలి గుణములను చెప్పికొనియుండెను. కన్నడమునందలి ప్రసన్న కవితాగుణ లలితపదాదులే నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత అను ప్రయోగములకు ప్రేరకములై యుండవచ్చును. కవితాగుణములను జెప్ప

పద్యములందే కాక గ్రంథస్థపద్యములందు కూడ కొన్నిచోట్ల నన్నయపై పంపని పద్యముల ప్రభావము కానవచ్చును.

శ్రీవనితావల్లభః వే
గీవిషయాధీశః కావ్యగీతప్రియః నా
నావనినాథ కిరీట త
టీవిలసత్ప్రత్న సంఘటిత పదకమలాః

అని నన్నయ రాజరాజును సంబోధించుచు వ్రాసిన పద్యము

శ్రీపతిగె యుద్ధమల్లమ
హీపతిగె నెగఱి పుట్టిప నఖిళ
క్ష్మాపాల మౌళిమణికిర
ణాపాళితనఖమయూఖ రంజితచరణం (పంప. ప్రథ. 18)

అను పంపభారతమునందలి పద్యమును పోలియున్నది.

(ii) పాండురాజు మాద్రిని కూడుటకు ముందు పంపడు వసంతఋతువును దీర్ఘ వచనములో వర్ణించియుండెను. నన్నయ యాసందర్భముననే వసంతఋతువును లయగ్రాహులలో మనోహరముగా వర్ణించియున్నాడు.

(iii) నన్నయ కణ్వాశ్రమమును వర్ణించుచు వ్రాసిన "శ్రవణ సుఖంబుగాసామగానంబులు చదివెడిశుకముల చదువుతగిలి" అనుప్రసిద్ధసీసపద్యమునకు మూలము వ్యాసభారతమున కాక పంపడుకావించిన శతశృంగమునందలి ఋష్యాశ్రమవర్ణనమునందున్నది.

(iv) ఆదిపర్వ చతుర్థాశ్వాసమునందు సత్యవతి వ్యాసునితలంపగనే అతడు వచ్చి ఆమెముందు నిలిచిన సందర్భమున నన్నయ "నీలగిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణవల్లరీజాలము వోని పింగళవిశాలజటాచయ మొప్పగా"అను పద్యమునువ్రాసియుండెను. దీనికి మూలము పంపభారతమున నున్నది.

(v) పంపని సమాసములకును నన్నయ సమాసమునములకును చాలా పోలిక కానవచ్చును. విభక్తిప్రత్యయములును ఒక్కమాదిరిగనే కనిపించును. ఇట్లే కారక విషయమున కూడ నన్నయకును పంపడికిని సాదృశ్యము కనిపించును.

(vi) కింపముడను ముని పాండురాజును శపించినపుడు నన్నయ

"ఎట్టివిశిష్ట కులంబునఁ
బుట్టియు సదసద్వివేకములుగల్గియు మ
న్గటిత కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురెమనుజుల్"

అను పద్యము రచించెను. పంపభారతమునందలి "ఎత్త వనమెత్త మృగయా వృత్త క మీ తపసి....ఆన్మకర్మాయత్తం పెఱ తల్లి దెల్ల"అను పద్యమునందలి ఎత్తుగడయు సమానములుగా నున్నవి. నన్నయకు పూర్వము తెలుగున అపర్యప్రాయములైన కావ్యములేమియులేని కారణమున అతడు సన్నిహితభాషయైన కన్నడమునందలి పంపభారతమునిశితముగా పఠించియుండును.

ఈవిధముగా నన్నయ సంస్కృతభారతమును బాగుగా చదివి కొన్నిచోట్ల పెంచియు, కొంచిచోట్ల తగ్గించియు, కొన్నిచోట్ల మార్చియు, కొన్నిచోట్ల యథాతథముగా ననువాదము కావించియు, కొన్నిభాగములందు సంస్కృత కావ్యనాటకాదులను, పంపభారతమును దృష్టిలో నుంచుకొనియు తెలుగుననాది కావ్యమును రచింప మొదలిడి దానిని సర్వాంగసౌందర్య శోభితముగా తీర్చిదిద్దియుండెను.

*    *    *    *

రస మమృతంబుగాఁగ మధురంబులు వాక్యపదాళు లూర్మికా
విసరముగాఁ గథాప్రతతి ద్వీపసముచ్చయమై రహింపఁగా
ననదృశ భావముల్ ప్రసరదాంతరవేణులుగాగ భారతో
ల్లసిత మహాసుధాపగ వెలార్చితి వాంధ్రవసుంధరా స్థలిన్

## 5. నన్నయ వర్ణనలు :

నన్నయ తాను రచించిన భారత భాగమున అవశ్యకమునుబట్టి వివిధ వస్తువు లను వ్యక్తులను ప్రదేశములను వర్ణించియుండెను. అతని వర్ణనలు మితములైనను ఉదాత్తములై, వర్ణ్యవిషయములను పఠితలకు సాక్షాత్కరింపఁ జేయుచుండును. ఉదాత్తత్వమును, సహజత్వమును అతని వర్ణనలందలి ముఖ్యలక్షణములు. గరుడో పాఖ్యానమునందలి సముద్రము, ఆదిపర్వమష్టమాశ్వాసమునందలి ఇంద్రప్రస్థ పురము, ద్రౌపదీ స్వయంవరము, సభాపర్వమునందలి దివ్యసభలు, అరణ్య పర్వమునందలి వర్ష శరదృతువులు మున్నగువాని వర్ణనము నిందుకు దృష్టాంత ములు. అతడు దేనిని వర్ణించినను దానికి సంబంధించిన వివిధాంగములను, సమగ్ర ముగా వివరించి తత్సమగ్రమూర్తిని పఠితల మనః ఫలకమున చిత్రితమగునట్లు చేయుచుండును.

> మృదురోమములును శంకు నిభకర్ణముల్ మెత్తని వలుద
> పొదుగును నిడుచన్నులును గుఱుచలై పొలుచు కొమ్ములును
> సదమల శరదిందు శంఖ నిభమైన ఛాయముగల్గు
> మొదలిది (ఆది. 7-99)

అను నందిని వర్ణనము,

> సాలప్రాంశు, నిజోజ్జ్వల త్కవచు శశ్వత్కుండలోద్భాసితున్,
> బాలార్క ప్రతిమున్, శరాసనధరున్, బద్ధోగ్ర నిస్త్రింశు, శౌ
> ర్యాలంకారు, సువర్ణ వర్ణు, ఘనుఁ, గర్ణాఖ్యున్, జగత్కర్ణ పూ
> ర్ణా లోలద్గుణుఁ జూచి (ఆది. 6-30)

అను కర్ణవర్ణనమును అందుకు నిదర్శనములు. వీనిని చదువునప్పుడు పఠితలు ఆధేనువును, ఆ వీరశేఖరుని తమ ఎదుట చూచుచున్నట్లు భావింతురు. నన్నయ పలుచోట్ల వ్యాసుని కవిలగడ్డమును, కవిలజడలను, కవిల కన్నులును, నల్లనిదీర్ఘ తనువును, కమండలువును వర్ణించి ఆ మునీంద్రునిమూర్తిని పఠితులకు ప్రత్యక్షము చేసియుండెను.

కథా సందర్భమునుబట్టి అతడు కొన్నిచోట్ల స్త్రీలను వర్ణించియుండెను. ఈ వర్ణనములన్నియు ఔచిత్యభాసురములును, పరిమితములునునై ఒప్పుచుండును.

అతడు సాధారణముగా వానియందు ముఖనేత్ర కుచ కేశ కటి భాగములను మాత్రమే పేర్కొనుచుండును. పితృదేవతలు గిరికకు మృగమాంసము పెట్టుమని ఆదేశించి యుండుటచే వసురాజు వేటకై వనమున కరిగెను. అప్పుడతడు గిరికను స్మరించి ఆమె యందు తన చిత్తము లగ్నమొనరించెనని తెల్పుచు నన్నయ క్రింది పద్యమును వ్రాసెను.

పలుకులు ముద్దును గలికిక్రాల్గన్నుల
    తెలివును వలుదచన్నుల బెడంగు
నలఘుకాంచీ పదస్థలముల యొప్పును
    లలితానేందు మండలము రుచియు
నళినీల కుటిల కుంతలముల కాంతియు
    నెలజవ్వనంబున విలసమును
నలస భావంబున పొలుపును మెలుపును
    గలుగు నగ్గిరికను దలచి తలచి (ఆది. 3-27)

ఈ వర్ణనమునందు గిరిక అవయవముల భౌతికాకృతికి కాక తత్కాంతిలీలాసౌందర్యముల కధికమైన ప్రాముఖ్యమొసంగఁబడినది. గిరిక చెంతలేనప్పుడు వసురాజామె అవయవములనుగాక నిజహృదయస్థితములైన తత్కాంతి సౌందర్యాదులను స్మరించి రక్తుడయ్యెననుట మిక్కిలి యుచితముగా నున్నది. శంతనుడు యోజనగంధిని చూచినప్పుడు ఆమె దేహసౌరభమును, శుచిస్మిత వక్త్రకాంతిని, విలాసమునుగాంచి మన్మథవశుడయ్యెనని నన్నయ వర్ణించియుండెను. ఇట్లు వర్ణ్యముల భౌతికాకృతినికాక అంతరీశోభను వర్ణించుట మిక్కిలి యుత్తమమైన పద్ధతి. వసంతర్తువురాఁగానే పాండురాజు కిందముని శాపమును లెక్కచేయక వసంత కుసుమాలంకార శోభితయై అపరమధు లక్ష్మివలె విలసిల్లుచుండిన మాద్రి సౌందర్యమును చూచి మన్మథరాగ మత్తుడయ్యెను.

చారు సువర్ణహాసి నవచంపకదామయు, సిందువార ము
క్తారమణీయమున్, వకుళదామ వతంసయునై యపూర్వ శృం
గారవిలాసలీల యెసఁగం దనముందటనున్న మాద్రి నం
భోరుహి నేత్రఁజూచి (ఆది. 5-14)

అను పద్యమున మాద్రి ధరించిన అలంకారములు వర్ణింపఁబడినవి. అప్పుడు వారడవిలో నుండిరి. అందుచే నామె ధరించిన తొడవులన్నియు వసంతర్తుదత్త

పుష్పమయములై నట్టివే. ఆమె ధరించిన చంపక దామము సువర్ణమును హసించుచుండెననియు, వకుళదామము వతంసవిలాస శోభితమై యుండెననియు అతడు వర్ణించియుండెను. దానిని ధరించి మాద్రి యపూర్వశృంగారముతో నెదుట నిలఁబడగానే పాండురాజు మోహితుడై యామెనుగూడి మరణము చెందెను.

విమర్శకులు నన్నయ వర్ణ్యముయొక్క ఏకైక విన్యాసమును వర్ణించి చిత్రకారుని చిత్రరచనా పద్ధతి నవలంభించునని తిక్కన యట్లుకాక ప్రతిక్షణ చాంచల్యమాన వస్తుదశా విపర్యయములను వర్ణించుచుండుననియు చెప్పుచుందురు. ఈ క్రింది పద్యములను చూచినచో ఆ విషయము తేటతెల్లమగును.

"తతూ్కపమున విలసతూ్కప ఘనవల్లి
యన్నిష్ట సఖి నూదియున్న దాని
గురు కుచయుగముపైఁ బరువడి దొరఁగెడు
కన్నీరు పూంెంచుచున్న దాని
వేపయూనిఁ గనియె." ఆది. 3.141

"ప్రాంశు జాలములుపైఁ ద్రాకినఁగరము రూ
క్షములగు నూర్ధ్వాలకములదాని
నతిమలినంబైన యర్ధ వస్త్రంబుచే
నావృతంబగు దేహయష్టి దాని
దమయంతిఁ జూచి" (అర. 2-102)

"హంసత్రేఁ దనవిని నంతకంబెను రూప
విభవాతి శయమున వెలయుదాని" (అర. 2-39)

ఈ పద్యములందు పాదాంతములందు గల "దాని దాని" అను సర్వనామములతో ముగియు విశేషణములోకే స్థితియొక్క వివిధ విన్యాసములను సూచించుచున్నవి. ఇందలి భావములను గ్రహించి చిత్రకారు డొక్కొక్క చక్కని చిత్రమును చిత్రింపవచ్చును. కణ్వాశ్రమమును వర్ణించు "శ్రవణ సుఖంబుగా సామ గానంబుల, చదివెడి శుకముల చదువు తగిలి" అను సీసపద్యము ఆశ్రమముయొక్క ఒక భాగమునందలి సంపూర్ణరూపమును పఠితల కనులయెదుటఁ బెట్టుచుండును. సభాపర్వాంతమున విదురుడు పాండవులు వనమున కరిగిన విధము చెప్పుచు ద్రౌపదీ పాండవులలో నెవ్వ రెవ్వరేమొనర్చుచు నేగిరో "వదన సరోజంబు వస్త్రాంతమునఁ గప్పికొనియేఁగె ధర్మ

నందనుడు మఱియు" అను సీస పద్యమున వర్ణించియుండెను. ఈ పద్యమును చదువుచుండగా వనమునకేగు ధర్మరాజాదుల స్వరూపము పఠితలకు ప్రత్యక్షము కాకమానదు.

నన్నయ దేనిని వర్ణించినను తదనుగుణమైన వాతావరణమును చక్కగా సూచించుచుండును. కణ్వాశ్రమ వర్ణన సందర్భమున ఏచి తనర్చి తలిర్చిన వివిధ వృక్షములను ఆజ్యహవిర్ధూత ధూమలతా సంతతులను, వేదధ్వనులను, స్వాహా శబ్దములను పేర్కొనుటయు; రాజసూయయాగ సందర్భమున వేదధ్వనులను విప్రాశీర్వాద నిస్వనములను వివరించుటయు, వర్షర్తువును వర్ణించినప్పుడు మేఘ గర్జనలను, కప్పకూతలను, వర్షధారలను , నవతృణశిలీంధ్రసురగోపములను పేర్కొనుటయు, వారణావతమును వర్ణించునపుడు విపణివీధులను సౌధములను, జనసమృద్ధిని పేర్కొనుటయు నిందుకు దృష్టాంతములు. తీర్థములను క్షేత్రములను వర్ణించునప్పుడాతడు వాని మహత్త్వమును,పవిత్రతను వివరించి పఠితలకు వాని యెడ భక్తిభావము కలిగించుచుండును.

చెలికత్తెలు "కలహంస పలికిన పలుకులు గణియించువడి దాని పోయిన వలనుజూచు" (అర. 2-26) అను సీసపద్యమున దమయంతి పొందుచుండిన మన్మథ తాపమును భీమరాజున కెఱింగించిరి. ఈ పద్యము నరససుందరమై నాయికల విరహావస్థను వర్ణించు సందర్భమున తరువాతి కవుల కెందఱికో ఒజ్జ బంతియైనది. వారిందఱి ఒక్కొక్క భావమునకొక్కొక్క పద్యము వ్రాసి వర్ణనమును విపులీకరించిరి. నలుడు తన్ను విడిచి వెళ్ళిపోయిన తర్వాత దమయంతి యాతని గానక అడవిలో నతని వెదకుచు "హా మహారాజ, మహా మహీరక్షణదక్ష! దక్షిణ బాహుదండ! దండితారాతి!" (అర. 2-81) "సహకారుఁ మత్ప్రియ సహకారుఁబున్నాగ పున్నాగుఁ దిలక భూభువన తిలకు" (అర. 2 94) అని దుఃఖించు పద్యములు కరుణరస పూరితములై తరువాతి కవులకు మార్గదర్శకములు కాఁజాలినవి.

నన్నయ భారత భాగమున నాలుగైదు యుద్ధ వర్ణనములు కూడ కలవు. ఈ యుద్ధ వర్ణనములందు వైవిధ్యము తక్కువగా కనిపించును. అతడు నరనారాయణు లకు రాక్షసులతో జరిగిన యుద్ధమును, భీమునకు బక హిడింబక కిమ్మీర రాక్షసులతో జరిగిన యుద్ధమును సౌగంధిక సరోవర సమీపమున భీమునికిని యక్ష రాక్షసులకును జరిగిన యుద్ధమును వర్ణించి భీముని అసాధారణమైన పరాక్రమమును వ్యక్తము

చేసెను. కాని అవి యన్నియు కొంచెమించుమించుగా ఒకే విధముగా నున్నవి. భీముడు బకుని చంపిన విధముననే కిమ్మీరుని కూడ చంపెనని నన్నయయే చెప్పియున్నాడు. సౌంభకాఖ్యాన, కిరాతార్జునీయ, నివాతకవచ సంహరణాది సందర్భములందు వర్ణింపఁబడిన యుద్ధములు మహా భయంకరములును, అపూర్వములునునై భయాద్భుతముల నావహించుచున్నవి. వీనిలో కిరాతార్జునీయ నివాత కవచ సంహరణ ఘట్టములందు అర్జునుడు ప్రదర్శించిన శస్త్రాస్త్ర నైపుణ్య మతిలోకమై ఆశ్చర్యమును కలిగించుచున్నది.

నన్నయ తన రచనలో నచ్చటచ్చట ప్రకృతి వర్ణనలు కూడ కావించియుండెను. వీనిలో రెండు మూడు తప్ప మిగిలినవన్నియు ఒకటి రెండు పద్యములతో కూడి మిక్కిలి చిన్నవిగా నున్నవి. కణ్వాశ్రమ వర్ణనము నిసర్గ సుందరమై అచ్చటి శాంతి, పావిత్ర్య, కర్మకలాపములను చక్కగా వ్యక్తము చేయుచున్నది. వసంత వర్షశరద్వర్ణనములు ఆయా ఋతువులందలి ప్రకృతి శోభను ప్రకటించుచు ఉదాత్త సుందరములుగా నున్నవి. వీనిని చూచియే తరువాతి కవులు విపులములైన ఋతు వర్ణనము కావించియుండిరి. నన్నయ ఆదిపర్వము పంచమాశ్వాసమునందు సాయంకాలమును, అరణ్యపర్వ తృతీయాశ్వాసమునందు రాత్రిని వర్ణించియుండెను. ఈ వర్ణనలు కథా సంబద్ధములై కాలగమనమును సూచించుచున్నవి. ఆదిపర్వమునందలి అష్టమాశ్వాసమున ఇంద్రుని యానతిచే విశ్వకర్మ పాండవులకై నిర్మించిన ఇంద్రప్రస్థపుర వర్ణనము చాలవఱకు నన్నయ కల్పితమైనట్టిదే. ఇది శ్లేషాద్యలంకారములతో కూడి గంభీర భావబంధురమై నన్నయ భావనా పాటవమునకు దృష్టాంతముగా నున్నది. ఇందతడు సౌధములను, కిరాటులను, బ్రాహ్మణులను, కామినులను, విపణులను, పరిఘను, ఎంతో సుందరముగా వర్ణించెను. ఈ వర్ణనములు తరువాత ప్రబంధకవులు తమ కావ్యముల ఆరంభములందు కావించిన పురవర్ణనములకు మార్గదర్శకమై మనోహరముగానున్నవి.

నన్నయ సాధారణముగా వర్ణన సందర్భమునందు వచనములనుగాని సీస పద్యములనుగాని వ్రాయుచుండెను. అతని వర్ణనవచనములు కించిద్దీర్ఘములును, సంస్కృత సమాసభూయిష్ఠములునునై శ్రవణానందము చేకూర్చుచుండును. గరుడోపాఖ్యానమునందలి సముద్రవర్ణనము, అస్త్రవిద్యా సందర్శనమునందలి రంగ వర్ణనము, ఆదిపర్వషష్ఠాశ్వాసమునందలి వారణావత వర్ణనము, రాజసూయ యాగమునకు ముందు అప్తమంత్రులు ధర్మరాజునకు వర్ణించి చెప్పిన వస్తుసంపద్వైభవ

వర్ణనము, హిమవంద్గంధమాదన పర్వతాదులవర్ణనము ఇందుకు దృష్టాంతములు. హిమవంతమును వర్ణించుచు నన్నయ అది రమణీయ భయానకమై యుండెనని తెల్పెను. అందలి ప్రకృతి సిద్ధములైన వాతావరణ పరిస్థితులు రమణీయములను వివిక్తతా మహౌన్నత్యములు భయానకములునై యుండుటలో ఆశ్చర్యములేదు. తిక్కన తఱచుగా యుద్ధమును వర్ణించునప్పుడీ యర్థముగల సమాసములునే వాడు చుండును. ఈ విధముగా నన్నయ తన రచనలో నచ్చటచ్చట కావించిన వివిధ వర్ణనములు గాంభీర్యమునకును, సహజత్వమునకును, ఉదాత్తత్వమునకును నిధానములై, పరిమితములయ్యు పరమ సుందరములై పరిఢవిల్లుచున్నవి.

* * * *

మతిమంతుల్ కవిపండితుల్ సుకవితా మాధుర్యమున్ గ్రోలగా
నితరుల్ వీనులవిందు లక్షరములందేపారు రమ్యత్వమున్
స్తుతియింపన్ రచియింతు భారతము నంచుందొల్త ( జేకొన్నయా
ప్రతినం దీర్చితి నక్షరాల రుచిరార్థ శ్రీలసద్దీ నిధీ

* * * *

## 6. నన్నయ కవితారీతి :

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమ్మని" అను సీస పద్యమున విష్ణు సన్నిభుడైన వేదవ్యాసుడు మహాభారతమునెట్లు విశ్వజనీనముగా రచించెనో నన్నయ వ్యక్తము చేసెను. అందలి లక్షణములు పెక్కు నన్నయ రచనకు కూడ సరిపోవును. మఱి మహాకావ్యత్వము, సర్వలక్ష్య సంగ్రహిత్వము, అను లక్షణములు మూలమునకంటె అనువాదమునకే ఎక్కువగా నన్వయించును. వ్యాస నన్నయల రచనల పోల్చి చూచినపుడు కొంత తారతమ్యము గోచరించును. అందుకు రచనలో ఆ మహాకవుల కున్న దృష్టిభేదమే కారణము. ఒకరియందు పౌరాణిక నైతికదృష్టియు, ఇంకొకరి యందు కావ్యకళా దృష్టియు అధికముగా నున్నట్లు గోచరించును.

అవతారికలో నన్నయ,

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసిమేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్

అను పద్యములో తన కవిత్వమునందు ప్రసన్నకథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తి నిధిత్వము అను మూడు గుణములుండునని సూచించెను. ప్రసన్న కథాకలితార్థయుక్తి అను సమాసమునందలి "కలితార్థయుక్తి" యను సమాసమునకు "కవితార్థయుక్తి"యను పాఠాంతరమున్నది. పండితులలో కొందఱొక పాఠము మఱికొందఱింకొక పాఠమును గ్రహించియున్నారు. కన్నడమునందలి పంప భారతమున ప్రసన్నకవితా గుణమను పదమే వాడబడినది. నన్నయ కూడా పంప భారతమును చూచియుండును. కావున ఆ పదమునే వాడి యుండును. ఆ సమాసమునకు ప్రసన్నమైన కథా కవిత్వమందలి అర్థముతోడి కూడికయని అర్థము. 'కలిత' పాఠమును గ్రహించినచో ప్రసాద గుణముతో కూడిన కథలందున్న అర్థముతో కూడిక యను నర్థము గ్రహింపవచ్చును. కథా కవిత అను పదమును మనమిప్పుడు దశకుమారచరిత్రము, విక్రమార్క చరిత్రము మొదలైన కథా ప్రధానములైన కావ్యములందలి కవిత్వమును సూచించుటకు వాడుచున్నాము. నన్నయకు పూర్వమాంధ్రమున ఎదో యొక విధమైన కవిత్వమున్న మాట నిజమే.

కాని కథారూపమైన కవిత్వమున్నట్లు కనఁబడదు. అట్టి కవిత్వమునకు శ్రీకారము చుట్టినవాడు నన్నయయే. ఆ విషయమును సూచించుటకై అతడు కథా కవితా పద మును వాడెనని కొందఱు చెప్పుదురు. ఆయూహ సమంజసముగనే కనఁబడుచున్నది. పై సమాసమున నున్న ప్రసన్న పదమును కథ, కవిత, అర్థము అను మూడింటికిని విశేషణము చేయవచ్చును. అప్పుడు ప్రసన్నములైన కథలతోడను, ప్రసన్నమైన కవిత్వముతోడను, ప్రసన్నమైన అర్థముతోడను కూడియుండుట అని అర్థము చెప్పవచ్చును.

ప్రసన్నమనగా ప్రసాద గుణముతో కూడినదని యర్థము. సంస్కృత లాక్షణి కులలో కొందఱీగుణము అర్థగుణమనియు, కొందఱు శబ్దగుణమనియు, కొందఱు ఉభయాత్మకమనియు, కొందఱు రసగుణమనియు, చెప్పియున్నారు. వారాగుణమునకిచ్చిన నిర్వచనములు సమన్వయించి చూచినచో ప్రసిద్ధార్థములు, ఝుటిత్యర్థ స్ఫోరకములు సప్రయోజనములునైన పదములను కలిగియుండుటయే ప్రసాదగుణమని తెల్లమగును. దీనినిబట్టి ఆయా సందర్భములందు ఆవశ్యకములైన అంశములను మాత్రమే చెప్పుచు ఒక్కమాఱు వినినంతనే లోని యర్థమును వ్యక్తమగునట్లు చేయుటయే నన్నయ కవితా ప్రసన్నతకు లక్షణమని ఊహింపవచ్చును. కథల విషయమునగూడ ఈ లక్ష ణము సమన్వయింపవచ్చును. అవసరములేని సన్నివేశములను విడుచుచు, చెప్పు కథలకు ప్రధాన కథతోఁగల సంబంధమును వివరించుచు, శ్రవణ మాత్రమున అందలి తత్త్వమును చక్కగా స్ఫురింపజేయుట కథా ప్రసన్నతయని వ్యక్తమగును. ఇంక అర్థ ప్రసాదమనగా అర్థవైమల్యము. వామనుడు వైమల్యమనగాఁ ప్రయోజన మాత్ర పరిగ్రహమని నిర్వచించి యుండెను.

ప్రసాదగుణము సర్వరస సమర్పకమైన సామాన్యగుణము. శుష్కకాష్ఠక మునం దగ్నివలె శబ్దార్థగతమైన స్వచ్ఛతచే ఇది సహృదయ హృదయములందు శీఘ్రముగా వ్యాపించును. ప్రసాదము రసగుణమగుటచేతను, సర్వరససాధారణమగుట చేతను, ప్రసన్నమును విశేషణముచే నానా సమయత్వము వ్యక్తము చేయఁబడు చున్నది. అందుచే ఈ సమాసమందలి ప్రసన్నపదమును నన్నయ రసదృష్టితో ప్రయోగించెనని చెప్పవచ్చును. సంస్కృత భారతమున రస దృష్టికన్న ధర్మతత్త్వ దృష్టి మిన్న. నన్నయ రచనలో కూడ ధార్మిక తాత్త్విక దృష్టిలేకపోలేదు కాని, రసమున కెక్కువ ప్రాముఖ్యము. మహాకవులెప్పుడును కథా సంఘటనములకుఁగాక

రసపోషణమునకే ఎక్కువ ప్రాధాన్య మొసంగుచుందురు. ఆనందవర్ధనుడు చెప్పినట్లు ఇతిహాసమువలననే కథా సిద్ధికలుగుట కవకాశమున్నది. అందుచే నన్నయ ప్రసన్న పద ప్రయోగముచే తన కథలను కవిత్వమును రసాకరములై యుండునని అభిప్రాయ పడినట్లూహింపవచ్చును. ప్రసాదము ఆత్మగతము అంగగతము అని రెండు విధము లుగా నుండవచ్చును. ఆత్మగతమైన ప్రసన్నత రస భావములకును, అంగగతమైన ప్రసన్నత దానిని వ్యక్తముచేయు శబ్దములకును సంబంధించియుండును. ఈ రెండింటినే నన్నయ అర్థయుక్తి అనియు, అక్షర రమ్యత అనియు వేరువేరుగా చెప్పియుండెను. అతని కవిత్వమునందును, కథలయందును, ఈ రెండు లక్షణము లలో కూడిన ప్రసన్నతాగుణమును సర్వతోముఖమై కానవచ్చును.

పై పద్యమున నన్నయ తాను నానారుచిరార్థసూక్తినిధినని చెప్పికొనియుండెను. సూక్తులనగా సుభాషితములు. అతడు రుచిరార్థములైన పెక్కు సుభాషితములకు నిధి యనిపై విశేషణమునకు అర్థము. సంస్కృతలాక్షణికులు యశస్సు అర్థము, వ్యవహార వేత్తృత, అమంగళ పరిహారము, సద్యః పరనిర్వృతి అను వానితోపాటు ఉపదేశము కూడ కావ్య ప్రయోజనముగా నుండవలెనని అభిప్రాయపడిరి. అందుచే కవులు వ్యంగ్యముగనో వాచ్యముగనో ఉపదేశాత్మకములైన సూక్తులను తమ కావ్యములలో ప్రవేశపెట్టుచుందురు. ఆంధ్ర మహాభారత మిట్టి సూక్తి రత్నములకు రత్నాకరము. నన్నయ భారతమును రచించునప్పుడు అమూలకములైన సూక్తులను పెక్కింటిని ప్రత్యేకముగను, అర్థాంతర న్యాసాలంకార పూర్వకముగను అచ్చటచ్చట చొప్పించి యుండెను. కథతో సంబంధము లేకుండ ఎవరైన సందర్భోచితముగ వాడుకొనుటకు తగినట్లు అతడు నీతియుక్తములైన విడి పద్యములను కూడ పెక్కుచోట్ల రచించి యుండెను. ఇట్టి సూక్తులను అతడు సాధారణముగా కంద పద్యములందే రచించు చుండును.

మతిఁ దలపఁగ సంసారం
బతి చంచల మెండమావులట్టులు సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్.

మున్నగు పద్యము లిందుకు నిదర్శనములు. ఇట్టివి ఆది సభా పర్వములందుకంటె అరణ్య పర్వమునం దెక్కువగా కన్పించును. రుచిరమనఁగా రుచిగల లేక తియ్యని.

యని యర్థము. ఆహారమునకు సంబంధించిన ఈ యర్థమును సుభాషితముల కన్వయించినచో అవి మృదుమధురములై చదివిన కొలంది చవులూరించు సామర్థ్యము కలిగియుండవలెనని చెప్పవచ్చును. భారవి కిరాతార్జునీయమున "హితమ్ మనోహారిచ దుర్లభం వచః" అని చెప్పియుండెను. అనగా హితకరత్వము, మనోహరత్వము అను లక్షణములు రెండును ఒక్కచో నుండుట అరుదని దీనియర్థము-నన్నయ సూక్తులలో ఆ గుణద్వయసమ్మేళనము కనిపించుచుండును.

నలోపాఖ్యానమునందు నలుడు తన్ను విడిచి వెళ్ళిన పిమ్మట దమయంతి అతనికై అన్వేషించి అతడెచ్చటను కానరాకపోవుటచే దుఃఖించుచు,

వగవగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్. (అర. 2-48)

అని పల్కియుండెను. స్థూలముగా పరికించినచో ఇది సత్యముయొక్క మహత్త్వమును తెల్పునట్టిదిగనే కనిపించుచున్నను, నలుని విద్యావైదుష్యములను కూడ చక్కగా వ్యక్తము చేయుచున్నది. ఆతడు నాలుగు వేదములను సాంగోపాంగముగ చదివి యుండును. నైషధకావ్యమున నలుడదీతి బోధాచరణ ప్రచారములచే విద్యలకు చతుర్దశత్వము కల్గించెనని శ్రీహర్షుడు చమత్కరించి యుండెను. చతుర్దశత్వమనఁగా పదునాలుగు యొక్క భావము లేక నాలుగు దశలను కలిగియుండుట. నన్నయ కథారంభమున నలుని వైదుష్యమును గూర్చి ఏమియును చెప్పియుండలేదు. కాని ఈ పద్యమున దానిని వ్యంగ్యముగా వెల్లడించెను. ఈ విధముగా నన్నయ సూక్తులొక్కొక్కచోట కథా సంబద్ధములుగా కానిపించుచునే గూఢమైన యర్థమును గూడ ధ్వనింపఁజేయుచు చుండును.

సూక్తియను పదమునకు నానుడి, జాతీయము సామెత, నీతి బోధకవచనము, మున్నగు నర్థములు కూడ చెప్పవచ్చును. నన్నయ రచనయందిట్టి వెన్నియో గోచరించును. ఇవి ఉపదేశ ప్రధాన దక్షములై యుండుటచేకాక నన్నయ దేశీయ శబ్దప్రయోగ వైచిత్రిని కూడ వెల్లడించు చుండును.

నన్నయ కథా కథన కౌశలము :

వేద నిక్షిప్తములైన నీతిధర్మ తత్త్వములను బోధించుటకై వ్యాసుడు మహాభారతమున కథోపాఖ్యానముల నెన్నిటినో చేర్చియుండెను. అట్టి ఉపాఖ్యాన

ములు మొదటి మూడు పర్వములందధికముగా కన్పించును. వానిలో గిరుడో పాఖ్యానము, యయాతిచరిత్ర, దుష్యంతోపాఖ్యానము, నలోపాఖ్యానము మొదలగునవి దేశమునందపారమైన ప్రచారమును పొందినవి. అందుకా కథల యందలి నిసర్గ రామణీయకముతోపాటు నన్నయ కథాకథన కౌశలము కూడ హేతువని చెప్ప వచ్చును. కథలను సహృదయ హృదయ రంజకముగా చెప్పుటలో అతనికి ప్రత్యేకమైన పాటవము కలదు. అందుచేతనే అతడు తన కవితా గుణములలో ప్రసన్నకథాకవితార్థయుక్తిని ప్రత్యేకముగా పేర్కొని యుండెను. కథ కనవసరములును, కథాగమనమున కాటంకము కలిగించునవియు నగు నీతి ధర్మ తత్త్వ వివరణములను బుద్ధిపూర్వకముగా తగ్గించుట, రెండు మూడు మార్లు వేరువేరు చోట్ల చెప్పఁబడిన సమాన కథా భాగముల నుచితరీతి నొకేరీతి సమ్మేళనము చేయుట, ప్రధాన కథకును ఉపాఖ్యానములకును గల సంబంధమును లెస్సగా విశదీకరించుట, కథలయందు గూఢముగా నుండు అంశములను ఉచితరీతి వ్యాఖ్యానించి సుబోధము చేయుట, విభావాను భావసాత్త్విక వ్యభిచారి భావములను తగినట్లు వర్ణించి స్థాయిభావమున కుత్కర్ష కల్గించి వివిధ రసములను సమ్యగ్రీతి పోషించుట అతడు కథలను ప్రసన్నములు చేయుటకై అవలంబించు పద్ధతులు.

ఉదాహరణమునకు సుకన్యోపాఖ్యానమును గ్రహింతుము. సుకన్య చెలికత్తె లతో వన విహారము చేయుచుండ ఒక పుట్టనుండి చ్యవనుని నేత్రకాంతులు మెఱపుల వలె బయటికి ప్రసరించి ప్రకాశించుట యామెకు గోచరించెను. అవి విలసత్ ఖద్యోత ప్రభలనుకొని ఆమె పుట్ట త్రవ్వించి చూచెను. అందామె కేమియు కానరాలేదు. కాని వెంటనే సంయాతి సేనలకు మూత్ర పురీషనిరోధము వాటిల్లెను. కూతువలన విషయ మంతయు నెఱిఁగి సంయాతి పుట్టచెంతకు వచ్చి పరికించెను. అతనికి బక్కచిక్కిన శరీరముతో కూడిన చ్యవన మహర్షి కనిపించెను, అతడు సుకన్యనాతనికి భార్యగా నిచ్చి సేనలకు కలిగిన బాధలను తొలగించుకొని వెడలిపోయెను. సుకన్య పుట్ట త్రవ్వించి నప్పుడామెకు చ్యవనుడు కన్పింపకుంతుటకును తరువాత సంయాతి పుట్ట చెంతకువెళ్ళి నప్పుడతడు కనఁబడుటకును కారణమేమని పాఠకులకు సందేహము కలుగును. సుకన్య పుట్ట త్రవ్వించినప్పుడు చ్యవనుడు కోపమున నిమీలిత లోచనుడై యుండెను. నికటవల్లీ గుల్మములతనినాచ్ఛాదించి యుండుటచే అతడు కనఁబడి యుండలేదు. తరువాత సంయాతి వచ్చినపుడతడు కన్నులు తెఱచియుండిన కారణ మున అతడు దృష్టిగోచరుడయ్యెను. పాఠకులకు కలుగు సందేహము నివారించుటకు

నన్నయ కాపించిన వ్యాఖ్యానమిది. అట్లే తపస్వియైన చ్యవనుడు సుకన్యను పరిగ్రహింపఁగోరుటకు కారణమేమి యను సందేహము కూడ పఠితలకు కలుగును. ఆమె పుట్ట త్రవ్వించుటకు అజ్ఞానముకాక, అతిశయ రూపయౌవన గర్వమే కారణ మనియు, ఆగర్వము నడిగించుటకే చ్యవనుడు మెను పెండ్లియాడఁగోరెననియు పఠితల సందేహమును తీర్చుటకై నన్నయ కావించిన వ్యాఖ్యానము.

శంతనుడు వేటకై యమునానదీ తీరమున కరిగి, అపూర్వమైన సుగంధము నాఘ్రాణించి, ఆ వైపున కరిగెను అచ్చట అతనికి యోజనగంధి కనఁబడెను. ఈ సందర్భమున నన్నయ ఆమె శరీర సౌరభమును, విలోల విలోకనములను, మనోహరాకారమును శుచిస్మితవక్త్రకాంతిని, విలాసమును చూచి శంతనుడు మనోజ బాణసంతాన హతుడయ్యెనని వర్ణించెను. ఇందలి శరీరసౌరభాదులు ఉద్దీపన విభావ ములు. విలోకనము లనుభావములు. మూలమునలేని ఈ విభావాను భావములను వర్ణించుటచే నన్నయ యిచ్చట స్థాయిభావమైన రతికి ఉత్కర్ష కలిగించెను. అట్లే నూతిలో పడిన దేవయానిని యయాతిపైకి తీయునపుడు నన్నయ "ఉన్నమద్గళదురు ఘర్మవారికణ క్రమకరాబ్జమువట్టి" అని సాత్త్వికభావమైన స్వేదమును వర్ణించి అచ్చటి శృంగారమునకు వన్నె కల్గించెను ఈ విధముగా నాతడు మూలమునలేని విభావానుభావ సాత్త్విక భావములను వర్ణించి, స్థాయికుత్కర్షకల్గించి కథలను రస పరిపుష్టములుగా నొనరించును.

నిశితముగా చూచినచో నన్నయ కథలన్నిటిలో నేదొయొక పరమార్థము నిక్షిప్తమైయుండుట గోచరించును. గూఢముగనో, అస్ఫుటముగనో నున్న దానినతడు తన రచనములో ప్రస్ఫుటము గావించి పాఠకుల చిత్తములకు హత్తుకొనునట్లు చేయ చుండును. ఈర్ష్యా కపటములవలన కలుగు హాని ఎట్లుండునో గరుడోపాఖ్యానము వెల్లడి చేయుచున్నది. కద్రువ అమాయకురాలైన వినత విషయమున ఈర్ష్యా కపటము లవలంబించి తత్ఫలితముగా తన సుతులను తానే శపించుకొనవలసి వచ్చెను. యయాతి పతనమునకు అతని గర్వమే కారణము. "నీ గర్వము నిన్నింత చేసె"నని ఇంద్రుడు యయాతితో నన్నమాట యిందుకు నిదర్శనము. సుందోపసుందోపాఖ్యానము "ఇంతుల నిమిత్తమున ధృతిమంతురు పొందుదురు భేదమతి" అను సత్యమును వ్యక్తము చేయుచున్నది. నలోపాఖ్యానము పతివ్రతయైన యిల్లాలు అధిక దుఃఖార్తుడైన భర్తకెట్లౌషధమగునో, పురుషులందు దోషపుంజమున్నను చివరికి ఎట్లు

ఖీష్టభోగము లందఁజాలునో ప్రకటించుచున్నది. ఋష్యశృంగుని కథ "విలాసినుల సహాలాప సహాసన సహయానములు బంధ సమములగు"నను పరమార్థమును తెలుపు చున్నది.

నన్నయ రచించిన కథలలో కొన్ని ఋషులకును, కొన్ని ధర్మతత్త్వమున కును, కొన్ని రాజులకును సంబంధించి యున్నవి. వైదికములు, లౌకికములునైన కథలు కూడ కొన్ని కలవు. భిన్నవస్తు స్వభావములుగల ఈ కథలను సాగించుటలో నన్నయ భిన్నకథా కథన శిల్పవిధానమునవలంబించెను. యయాతి సుకన్యో పాఖ్యానములయందు వ్యంగ్య విధానమును, దుష్యంతనలోపాఖ్యానములందు కథా ప్రాధాన్యమును, రురు ఋశ్యశృంగ చరిత్రములందు మనస్తత్త్వప్రాముఖ్యమును, దీర్ఘతమ వ్యుషితాశ్వుల వృత్తాంతములందు ధర్మతత్త్వోపదేశ వైదగ్ధ్యమును కాన్పిం చును. సర్పయాగమును, భృగు వృత్తాంతమును వైదికకర్మ ప్రధానములు. అరణ్య వర్వమునందలి కథలు పెక్కు తీర్థక్షేత్ర మాహాత్మ్యమును వివరించును.

కథాకథనమున నన్నయ అంగాంగిభావములకు తగినంత ప్రాధాన్యమిచ్చు చుండును. ఉపాఖ్యానములను అతి విస్తృతముగా వర్ణించి ప్రధాన కథకుఁగాని, అంగ వస్తువును విస్తరించి అంగి వృత్తాంతమునకుఁగాని అతడెప్పుడును లాఘవము చేకూర్పడు. గరుడోపాఖ్యానమున సముద్ర మథన, విభావసు సుప్రతీక వృత్తాంత ములను, యయాతి చరిత్రమున కచదేవయానుల వృత్తాంతమును అతడు సంగ్ర హించుట కిదియే కారణము. ఇట్లే అంగరసములను విస్తృతముగా వర్ణించుటచే అంగి రసమునకు లాఘవము కల్గింపక ఆతడు వానిని సూచ్యమాత్రములు కావించు చుండును.

కథాకథనమున రెండు ముఖ్య పద్ధతులున్నవి. అందొకటి కవి తటస్థుఁడై యిట్లు జరిగెనట్లు జరిగెనని చెప్పుట. రెండవది పాత్రల సంభాషణముల మూలమున కథను సాగించుట. మొదటి దానిని కథన పద్ధతి యనియు రెండవ దానిని నాటక పద్ధతియనియు చెప్పుదురు. నన్నయది ప్రధానముగా కథన పద్ధతి. నన్నయ నలో పాఖ్యానము, దుష్యంతోపాఖ్యానము మున్నగు పెద్ద కథలను స్వతంత్రకావ్యములా అనునట్లు సర్వాంగసుందరముగా తీర్చిదిద్దెను. ప్రధాన కథయందలి ముఖ్య సన్నివేశ ములు కూడ ఉచితములైన అలంబోపబృంహణోపసంహృతులతోఁగూడి హృద్యము లుగా నుండును. అతని నలోపాఖ్యానమును, 'హంసదౌత్యము, స్వయంవరము

ద్యూతము, వనగమనము, పునస్సమాగమము రాజ్యసంపాదనము, అను ముఖ్య విభాగములుగా విభజింపవచ్చును. సభా పర్వమునందలి కథ రెండు సభా వృత్తాంతములతోడను, లోకపాల సభావర్ణన వృత్తాంతముతోడను గూడి ఆ పర్వమున కానామము సార్థకమొనరించుచున్నది. మయుడు సభను నిర్మించి యిచ్చుట, నారదుడు వచ్చి ఆ సభ అపూర్వ సౌందర్యమును ప్రశంసించుట, ధర్మరాజు రాజసూయమొనరించుట దుర్యోధనుడు సభావైభవమును జూచి ఈర్ష్యాగ్రస్తుడగుట, ధృతరాష్ట్రిడతనికొక సభ నిర్మించి యిచ్చుట అందు ద్యూత ద్రౌపదీ వస్త్రాపహరణములు జరుగుట పునర్ద్యూతము, పాండవులు వనములకరుగుట సభాపర్వము నందలి ముఖ్యాంశములు. అందలి రెండాశ్వాసములందును రెండు సభలు కథాగమనమున కాధారములై వస్త్వైక్యమును సంఘటించుచున్నవి. అస్త్రవిద్యా ప్రదర్శనమందు కర్ణుడు కౌరవపక్షము నవలంబించుట, కుంతి ప్రత్యభిజ్ఞచే నతని తన కుమారుడుగా గుర్తించుట అనునవి ప్రధానాంశములు. ఆదిపర్వ పంచమాశ్వాసము. కౌరవులు భీముని బలవిశేషమును, అర్జునుని ధనుర్విద్యా పాటవమును తలపోసి మనముల కుందు చుండిరను విషయముతోడను, అస్త్ర విద్యాప్రదర్శన వృత్తాంతము దుర్యోధనుడు కర్ణుని సహాయునిగాఁబడసి అర్జునుని వలని భయమును వీడి యొమ్మున చేయిడి హాయిగా నిద్రపోయెనను విషయముతోడను ముగియు చున్నవి, ఈ రెండుప సంహృతులను సమన్వయముచేసి చూచిన అస్త్రవిద్యాప్రదర్శనమే ప్రయోజనముతో ఏర్పాటుపబడెనో తెల్లమగును. కుంతి కర్ణుని గంగలో విడిచిన పిమ్మట మరల నాతని చూచుట అస్త్రవిద్యాప్రదర్శన సందర్భమునందే. ఈ మధ్యకాలమున నామె ఆంతర్యముగా నేమివేదన ననుభవించెనో నన్నయ చెప్పియుండలేదు. అందుచే ఈ సందర్భమున కుంతికతడు అధికమైన ప్రాధాన్యమొసంగెను. ఈ విధముగా నతడు ప్రధాన కథాభాగములందైనను, ఉపాఖ్యానములందైనను ఆది మధ్యావసానములను శిల్ప సుందరముగా సంఘటించు చుండును.

నన్నయ కొన్నిచోట్ల కథాంశమున నన్నిటిని వాచ్యముగా వివరింపక కొన్నిటిని మాత్రము పేర్కొని అవి యట్లు జరుగుటకు కారణములను పాఠకుల హృదయములకు విడిచివేసెను. పాండురాజు భార్యలతో శతశృంగమున నివసించుచున్నపుడొక అమావాస్యనాడు బ్రహ్మను సేవించుటకై మునులరుగుచుండిరి. పాండురాజు భార్యలతో వారి ననుసరించెను. మునులు వారిని చూచి, "వీరతి లలిత మృదులాకారలు విషమములైనగిరి గహనములందు నడువనేరరు మఱియు నివి దేవపథములు మీరింక

రాక అగు"దని వారించిరి. పాండురాజు వారి మాటలు విని "అనపత్యులు స్వర్గ ద్వారమును చూడఁజోవరట. నేననపత్యుఁడ నేమి చేయుదు"నని దుఃఖించెను. మునులు పాండురాజు అనపత్యతను గూర్చి ఏమియును పల్కియుండలేదు. కాని వారి మాటల్లు విని పాండురాజు తాననపత్యుడగుటకు దుఃఖించెను. పాండురాజు భార్యలు అతిలలిత మృదులాకారు లనుటలో వారి అనపత్యతయు, ఇవి దేవపథములనుటలో అనపత్యుడు స్వర్గమున కరుగుటకనర్హుడనియు వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది ఇట్లే యయాతి చరిత్రలో శర్మిష్ఠ దేవయానిని పాడునూతఁద్రోసి నిర్భయముగా వెడలి పోవుటకును దేవయాని "విలసత్కృపఘనవల్లి యన్నిష్టసఖినూది" యానూతియందే ఉండి పోవుటకును కారణమును నన్నయ చక్కఁగా వ్యక్తము చేసియుండెను.

నన్నయ ఏ ఘట్టమున కెవరి కెంతప్రాధాన్యమీయవలెనో గుర్తించి వారికంత ప్రాధాన్యమొసంగు చుండును. అతడు చేయు సూచనలచే పఠితలా ప్రాధాన్యమును గ్రహింపవలెను. పాండవ కౌరవుల వైరమునకు ముఖ్యకారణము ద్యూతము. ద్రౌపదీ పరాభవము దాని పరమావధి. అందుచే నన్నయ యీ సందర్భమున ద్రౌపదికి ప్రాధాన్యమిచ్చి, ఆమెను కేంద్రముగా చేసి వర్ణనము సాగించియున్నాడు. దుష్యంతో పాఖ్యానమున "ఇది ముని కన్యయేని మఱియేలొకో ఈ లలితాంగియందు నా హృదయము తద్దయుందగిలె" అనియు, "ఇది మునినాథ కన్యయని యంతయు నిస్స్పృహవృత్తినున్న నాహృదయము... మదన బాణపరంపర కప్పుడుండె నా స్పదమయి" అనియు రెండు పద్యములున్నవి. ఇవి రెండును సమానారంభములు కలిగి కథా ప్రవాహముపై కట్టఁబడిన వంతెనకు రెండువైపుల కల ఆధార స్తంభములవలె నున్నవి.

కథాకథన సందర్భమున నన్నయ కొన్ని పదములకును వాక్యములకును ప్రాధాన్యమొసంగి అవి ఆ కథల కాయువు పట్టులని సూచించుటకై వానిని రెండు మూడు మారులు పునరుక్తములు చేయుచుండును. యయాతి చరిత్రమందలి ఉద్ధరించి అను పదమును ఋశ్యశృంగోపాఖ్యానమునందలి "ప్రబోధించి" అను పదమును ఇందుకు తార్కాణము.

నన్నయ ప్రథానములైన కథలను ఆయా విషయములు జరిగిన ప్రదేశములను బట్టి కొన్ని ఘట్టములుగా విభజించి అటు, ఇటు, అంత, ఇక్కడ అను పదములతో ఆ ఘట్టముల మార్పును సూచించుట నాటకమునందలి రంగ విభజనమును స్మృతికి

దెచ్చుచుండును. నలుడు దమయంతి నడవిలో విడిచివెళ్ళిన పిమ్మట ఆమె మేల్కాంచి నలుని కొఱకన్వేషించి యతని గానక చేదిపురమున కరిగెను. నన్నయ యింత వఱకును దమయంతి వృత్తాంతమును దెలిపి తరువాత నలుని వృత్తాంతము చెప్ప నారభించెను. ఇచ్చట నన్నయ "నలుడు దమయంతిని బాసి అరణ్యమున నరుగువాడు ముందట"నని తెల్పి రంగము మార్పుకు సూచించెను. అట్లే సుభద్ర యతియే అర్జునుడని ఎఱుంగక అతని నర్జునుని గూర్చి ప్రశ్నించుట, సౌగంధికాపహరణమున దారి కడ్డముగా పండుకొని యున్న హనుమంతుని జూచి భీముఁడాతఁడే హనుమంతుఁడని ఎఱుంగక, అతని పరాక్రమమునే ప్రశంసించుట నాటకీయ చమత్కారముతోకూడి మనోహరములుగా నున్నవి.

ఉదంకుడు జనమేజయునితో సర్పయాగమును గూర్చి తెల్పుచు "ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసినదానతత్కులంబెల్లను దూషితంబగుట యేమి యపూర్వము" అని తక్షకుని దుష్కార్యముచే సర్పకులమున కంతకు హానికల్గుటను సూచించెను. దుర్జనుడైన దుర్యోధనుని దుశ్చేష్టలచే కౌరవవంశ మంతయు వినాశము పొందునను భవిష్యద్విషయము నిది చక్కగా సూచించుచున్నది. అస్త్రవిద్యాప్రదర్శన సందర్భమున భీమదుర్యోధనుల గదాయుద్ధము ఘోరమై, భావి పాండవ కౌరవ రణాభిసూచన పటిష్టంబయ్యె"నని నన్నయ వర్ణించెను. నిజమున కప్పటికి కౌరవ పాండవ సమరముయొక్క ప్రసక్తియేలేదు. ఈ విధముగా నన్నయ ధ్వనిపూర్వకముగా భావికథా సూచనమొనర్చిన నన్నివేశము లనేకములున్నవి. వనగమనమునకు పూర్వమర్జునాదులు కావించిన ప్రతిజ్ఞలిందుకు నిదర్శనములు. నలుడు దమయంతితో నరణ్యమునఁదిరుగుచు ఆమె కేమార్గమెచటికి పోవునో తెల్పియుండెను. నిజమున కట్లు తెల్పవలసిన యక్కఱ ఏమియులేదు. కాని ముందు తానామెను విడిచిపోవలసిన అవసరము కలుగును కావున ఆమెకామార్గములన్నియు చెప్పినచో ఆమె పుట్టినింటికి పోయి సుఖముగా నుండునని అతడట్లు చెప్పుట యందలి యుద్దేశము.

అరణ్య పర్వమంతయు కథోపాఖ్యానములతోడను, నీతిధర్మతత్త్వ వివరణములతోడను కూడియుండును. కొందఱు విమర్శకులు వీనిని వ్యాసుడు వ్రాసియుండ లేదనియు నెవరో నడుమ చేర్చియుందురనియు నభిప్రాయపడుచున్నారు. కాని భారత రచనాక్రమమును పరిశీలించి చూచినచో అవి యన్నియు మూలకథా ప్రణాళికయందే

ఉండెననీ స్పష్టమగును. ఇందలి కథోపాఖ్యానములు కాలగమనమును సూచించుటకును, ప్రముఖాంశకథా రహిత భాగమును కూడ పఠితలానందముతో చదువుట కుత్సాహము కలిగించుటకును పనికివచ్చునని పిసాని అను విమర్శకుడు చెప్పియుండెను. అరణ్య పర్వమునందలి సౌగంధికాపహరణము భీముని ప్రియసాహసత్వమునకును, కిరాతార్జునీయ కాలకేయ నివాతకవచవధ వృత్తాంతములు అర్జునుని అపూర్వపరాక్రమమునకును, అజగరోపాఖ్యానము ధర్మజుని ధర్మజ్ఞతకును నిదర్శనములై మిక్కిలి రమ్యములుగా నున్నవి. కృష్ణుఁడు చెప్పిన సౌంభకాఖ్యానము వీరరస భూయిష్ఠమై అద్భుతముగా నున్నది. నలోపాఖ్యానము భారతమునందలి కథలకెల్ల తలమానికమై నన్నయ కథాకథన శిల్పమున కుత్కృష్ట నిదర్శనముగా నున్నది.

*　　*　　*　　*

పాత్రల చిత్తవృత్తుల స్వభావ మెఱింగి రసాకరమ్ములై
యాత్రము గొల్పు సంఘటనలద్భుతరీతి సృజించి దృశ్యముల్
నేత్ర పురఃప్రదేశమున నిల్పుచు వ్యర్థపదాలు వాడకే
చిత్రముగాఁ గథారచన చేయుట నీదగు సొమ్ము ధీమణీ

## 7. నన్నయ రసపాత్ర పోషణము :

మహాభారతము పెక్కుకథోపాఖ్యానములతో కూడియుండుటచే వివిధ రసముల కాకరమై యుండును. శాంతమందలి ప్రధాన రసము అంగిరసమైన దానికెచటను భంగము కలుగకుండ అంగరసములను తగినట్లు పోషించుచు నన్నయ రసపోషణమున ఎంతో మెలకువ ప్రదర్శించియున్నాడు. సభాపర్వమున ధర్మజుడు కృష్ణునికర్ఘ్యమిచ్చుచుండ శిశుపాలుడు తీవ్రముగా నాక్షేపించెను. అప్పుడు సహదేవుడు కుపితుడై "దీనికిందొడంబడమని దుర్జనత్వమునఁబల్కెడు వీరుల మస్తకంబుపై నిడియెద" ననిపల్కుచు పాదమెత్తెను ఇది రౌద్ర రసమునకు మిక్కిలి యనువైన సన్నివేశమైనను నన్నయ ఒక్క పద్యముతో మాత్రము దానిని సూచించి యూరకుండెను. దుర్యోధనుడు ద్రౌపదిని తన యూరుతలము నెక్కరమ్మని సన్న చేసినప్పుడు భీముఁడు క్రుద్ధుఁడై దుర్యోధనుని తొడలు భగ్నముచేసెదనని శపథము చేసిన ఘట్టము కూడ రౌద్ర రసపోషణమున కుచితమైయున్నది. కాని నన్నయ దానిని విరివిగా వర్ణింపక ఒకటి రెండు పద్యములలో సూచించి విడిచివేసెను. ఈ విధముగా నన్నయ పెక్కుచోట్ల నంగిరసమునకు లాఘవము కలుగకుండ నంగరసములను పోషించెను.

నన్నయ భావముల నెచటను పొంగిపొరల నీయక నిగ్రహించుచుండును. ఎట్టి పరిస్థితులలోనైన అతని పాత్రలు గాంభీర్యమును విడువక నిగ్రహముతో వర్తించుచుండును. సభలో దుశ్శాసనుడు వలువ లొలుచుచుండునప్పుడు ద్రౌపది భయపడి కృష్ణుని తలంచెను. ఇచ్చట భక్తిరసముతో కూడిన పద్యము లెన్నియైన వ్రాయవచ్చును. కాని నన్నయ అట్లు చేయక కోమలి కృష్ణుఁదలంచె భీతయై అని ఒక్క వాక్యమును వ్రాసి యూరకుండెను. శైశవమున కర్ణుని కుంతి గంగలో విడిచిన వృత్తాంతమును నన్నయ ఎఱ్ఱన లిరువురును వర్ణించియుండిరి. వానిని పోల్చి చూచినచో నన్నయ నిగ్రహశక్తి తెలియవచ్చును. సర్పయాగము చేయుమని ప్రేరేచుటకై ఉదంకుడు జనమేజయుని కడకరుగుదెంచినపుడతని "మితహిత సత్యవాక్యజనమేజయ" అని సంబోధించెను.

మనమునకు బ్రియంబును, హిత
మును, బథ్యముఁ, దథ్యమును, సమోఘము, మధురం
బును, బరిమితమునునగు పలు
కొనరఁగఁబలుకునది ధర్మయుతముగ సభలన్. (ఆది. 3.205)

అనునది యయాతి పూరునకు బోధించిన నీతులలో నొకటి. ఈమితహిత సత్య వాక్యత్వము నన్నయ పాత్రములన్నిటియందు గోచరించుచుండును.

నన్నయ వివిధ సన్నివేశములందు వివిధ రసములనుచితముగా బోషించి యుండెను. అతని యుద్ధవర్ణములన్నియు,-ముఖ్యముగా అరణ్యపర్వమునందలి సౌంభకాఖ్యాన నివాతకవచ సంహార సందర్భములు-వీరరౌద్ర రసములకు నిలయములు. కణ్వాశ్రమ వర్ణన సందర్భమున శాంతమును, పాండవు లరణ్యమునకు పోవు సందర్భమున కుంతి విలపించునపుడు కరుణమును, భీముడు బకాసురుని చంపి అతని కళేబరమును నగరద్వారమున కీడ్చుకొని వచ్చినపుడు బీభత్సమును, అమృత మథన సందర్భమున అద్భుతమును, తపతీ సంవరణులయు, గంగా శంతనులయు, శకుంతలా దుష్యంతులయు వృత్తాంతమును వర్ణించునపుడు శృంగారమును చక్కగా పోషింపఁబడెను. నలోపాఖ్యానము కరుణరస పూరితము. ఊర్వశి అర్జునుని వలచిన సందర్భమున శృంగారరసాభాసము గోచరించుచున్నది. ద్రౌపదీ స్వయంవరానంతరము మత్స్యయంత్రము భేదింపలేని రాజులు కుపితులై ద్రుపదుని మార్కొనిరి. దుృపదుడు బ్రాహ్మణుల మఱుగుచొచ్చెను. బ్రాహ్మణులాతని నూరడించి దండాజినము లెత్తి శత్రుబలముపై వీవఁదొడంగిరి. ఈ ఘట్టము హాస్యరసమునకు స్థానము. దానిని చూచి అర్జునుడు కూడ నవ్వినట్లు నన్నయ వర్ణించెను. అరణ్యపర్వ తృతీయాశ్వాసమున ఋశ్యశృంగుడు వేశ్యలనుకూడ ఋషికుమారులను కొని వర్ణించిన ఘట్టము కూడ హాస్యరసమున కాలవాలమై యున్నది. నన్నయ భారతమును ఇతిహాసముగా కాక కావ్యముగా రచింపఁదలచిన వాడగుటచే రసపోషణ విషయమున మిక్కిలి శ్రద్ధ వహించెను.

పాత్ర పోషణము : నన్నయ తాను రచించిన భాగమున నాయా పాత్రల గుణశీల స్వభావముల నెంతో నేర్పుతో ప్రకటించి యుండెను. అతడు దుర్యోధనుని అసూయా దౌష్ట్య దురభిమానములను, శకుని కైతవమును, దుశ్శాసనుని ధూర్తత్వమును, ధృతరాష్ట్రునికి పాండవుల యెడగల మిథ్యా వాత్సల్యమును, భీష్మద్రోణుల సమత్వమును, కృష్ణుని ధర్మరక్షణ పరాయణత్వమును, ధర్మజుని ధర్మతత్పరతను, భీమార్జునుల భ్రాతృభక్తిని, కర్ణుని రాజభక్తి పరాక్రమములను చక్కగా వర్ణించెను. అతని స్త్రీలు పాతివ్రత్యమునకు పట్టుగొమ్మలు. క్షమాన్వితలు. అతడు గాంధారి పాతివ్రత్యమును, ద్రౌపది ఆదర్శగృహిణీత్వ ధర్మజ్ఞతలను, కుంతి పుత్రప్రేమను,

దమయంతి పాతివ్రత్య లోకజ్ఞతలను, దేవయాని గడుసుఁదనమును, సుకన్య యౌవన చాపల్యమును చాల నేర్పుతో వర్ణించెను. సభాపర్వమున ద్రౌపది ధర్మజ్ఞతా గృహిణీత్వముల నాతడు నేర్పుతో వర్ణించెను దుశ్శాసనుడామెను సభకీడ్చుకొని వచ్చినప్పుడామె లజ్జాకోపపారవశ్యమున పలికిన పలుకులు ఆమె సత్యమైన ఆగ్రహావేశమును ధర్మశీలతను వ్యక్తము చేయుచున్నవి. రాజసూయ యాగమున సకల ప్రాంతములనుండి వచ్చిన పెద్దలను సాధులను ఆదరించి గౌరవించిన తెఱంగామె యాదర్శ గృహిణీత్వములకు నిదర్శనము. అయోనిజయైన యామె ప్రకృతి మానవభామిని కాదనియు పరమ పతివ్రతయనియు, ధర్మరతయనియు, ధృతరాష్ట్రిదన్న వాక్యములు సత్యశోభితములు.

నన్నయ ఆయా పాత్రలను ప్రవేశపెట్టు నప్పుడారంభముననే వారి శీల స్వభావములందలి ప్రధానాంశములను విశేషణములచే వెల్లడిచేయుచుండును. భీష్ముఁడనఘుఁడు, ఆత్మవిజ్ఞానమున సనత్కుమారాదులతో సమానుడు. ధృతరాష్ట్రుడు ప్రజ్ఞాచక్షుఁడు, బలవన్నాగాయుత బలసంపన్నుఁడు. పాండురాజు గుణరత్నాంబు నిధి. ధర్మజుఁడతి స్థిరధర్మమూర్తి. భీముడు ప్రియసాహసుఁడు, ఉత్తమస్థిరజవ సత్వమూర్తి. నకుల సహదేవులు సూర్యేందు ప్రకాశతేజులు. అర్జునుఁడు స్థిర పౌరుషుడు. ద్రోణగాంగేయ విదురులు ధర్మార్థ విత్తములు, సత్యవాదులు, మధ్యస్థ విమలమతులు. నలుఁడనవరతాక్ష ప్రియుఁడు. ఋశ్యశృంగుడు వేదాంతవేది. కర్ణుఁడు శౌర్యాలంకారుఁడు. జగత్కర్ణపూర్ణాలోలద్గుణుడు, జనమేజయుఁడు మితహితసత్య వాది. ఉదంకుడు గురుహిత కార్యంధురంధరుఁడు, కచుడు వినయ వ్రతశీలుడు. దుష్యంతుఁడనంతసత్త్వుడు. యయాతి యనఘ చరితుఁడయ్యును యౌవన గర్వితుఁడు. కుంతి వినయాభిమాన వివేక సౌజన్యాది సదమల గుణరత్న జన్మభూమి. సుకన్యసద్య స్సంజాత బుద్ధిసంపత్రిమ మొదలైన విందుకు దృష్టాంతములు.

నన్నయ కొందఱు వ్యక్తులయందలి పరస్పర విరుద్ధగుణస్వభావములను ప్రతియోగముచే వ్యక్తము చేయుచుండును. పాండురాజు మరణానంతరము ఋషులు పాండవులను హస్తినాపురికిఁగొని వచ్చినంతనే నన్నయ పాండుకుమారులు వినయాన్వితులనియు కౌరవులుద్ధతులనియు సూచించెను. మయుఁడు పాండవులకు నిర్మించియిచ్చిన సభను జూచి దుర్యోధనుఁడసూయాగ్రస్తుఁడై కృశుడు వివర్ణుడు నయ్యెను. ధృతరాష్ట్రుడు దుర్యోధనునికొఱకు కట్టించిన సభను జూచి లక్ష్మీధర

మూర్తియైన ధర్మజుఁడెంతయు మెచ్చుకొనెను. గరుడోపాఖ్యానమున నన్నయ కద్రూవినతల శీలములందలి వ్యత్యాసమును చక్కగా ప్రదర్శించెను. అతడీ విధముగా చిన్న చిన్న విశేషణములతోడనే పాత్రల గుణశీల స్వభావములను పఠితలకు ప్రత్యక్షము చేయుచుండును.

నన్నయ యౌచిత్యపోషణము :- అనౌచిత్యముకంటె రసభంగమునకు వేరు గొప్పకారణము లేదని ఆనందవర్ధనాదులు చెప్పియుండిరి. అందుచే నన్నయ ఔచిత్య పరిపోషణమునందెంతో శ్రద్ధచూపెను. యయాతి చరిత్రమున నతనిని దేవయాని వివాహమాడుటకు ముందొకసారియు, తరువాత నొకసారియు శర్మిష్ఠా దేవయానులు వనవిహారమున కరిగియుండిరి. శర్మిష్ఠ రాజపుత్రి యగుటచే మొదటి సారి శర్మిష్ఠకును, ఆమె రాజకుమారియయ్యు దాసియగుటచే రెండవసారి దేవయానికిని నన్నయ ప్రాధాన్యమొసంగియుండెను. అడవిలో నలుడు తన్నువిడిచి వెళ్ళిపోయిన తరువాత దమయంతి ఎన్నోకష్టములు పడి చివరికి పుట్టినిల్లు చేరెను. తరువాత నామె నలాన్వేషణమునకై పెక్కు ప్రయత్నములు కావించెను. ఏమి చేసినను ఆమె తల్లితో చెప్పి చేసెనే కాని తండ్రి యెదుటికేగి ఏమియు చెప్పియుండ లేదు. ఇది రాజాంతఃపురములందలి రాజకన్యల ప్రవృత్తి. వికృతాంగుడై యుండినను బాహుకుడు నలుడేయని ఎఱిఁగి దమయంతి యా విషయము తల్లితో చెప్పెను. కాని యాతడు నలుడని స్పష్టముగా తెలియు వఱకును, అతనితో ప్రత్యక్షముగా మాట్లాడక, అతఁడు వినునట్లుగా నలుడు చేసిన దయారహిత కార్యములన్నియు ప్రథమపురుషమున వివరింపఁదొడగెను. అపుడు బాహుకుడు తానే నలుడనని వెల్లడిచేసెను. ఈ సందర్భమున దమయంతి ప్రవర్తించిన విధము మిక్కిలి యౌచిత్యశోభితమై యున్నది.

అసభ్యములు ధర్మరహితములునగు విషయములను నన్నయ వాచ్యముగా తెల్పక సూచ్య మాత్రములు కావించుచుండును. దాశకన్య వసువీర్య ప్రభవయని దివ్యదృష్టిచే నెఱిఁగిన పిమ్మటనే పరాశరుఁడామెయందు వలపు నిలిపి ఆ విషయము నామెకు తెల్పెను. నన్నయ ఈ సందర్భమున పరాశరుడు తన యభిప్రాయ మెఱింగించెనని తెల్పుట అత్యంతతౌచిత్యభాసురముగా నున్నది. అట్లే యయాతి శర్మిష్ఠకు నభిమతంబొనరించెననియు, అర్జునుడులూచి మనోరథంబు నలిపి యామ్రాత్రి నాగభవనంబున నివసించెననియు తెల్పి నన్నయ అచ్చటి సంభోగ వృత్తాంతములను సూచ్యమాత్రములు కావించెను. అనాగరికుఁడయ్యు కిరాతుడ డవిలో

నొంటరిగా కనబడిన సౌందర్యమూ ర్తియగు దమయంతితో తన కోరిక వాచ్యముగా తెల్పక "నిజ హృదయం బెఱిగించె లతాంగి కనింద్య చరితకు వేడుకతో"నని వ్రాయుట నన్నయ యౌచిత్య పరిపోషణమునకు పరాకాష్ఠ ధృతరాష్ట్రు నానతిచే ధర్మరాజును ద్యూతమున కాహ్వానించుటకై ఇంద్రప్రస్థమున కరిగినప్పుడు విదురుడు కుశలప్రశ్నానంతరమతనికి. నిజాగమన ప్రయోజనమెఱింగించెనని వ్రాయుట నన్నయ ధర్మేతర విషయములను తెల్పునపుడు డవలంభించు ఔచిత్య శోభితమైన పద్ధతికి దృష్టాంతము.

నన్నయ లోకజ్ఞత :- తన కుల బ్రాహ్మణుడనను సీస పద్యమున అతడు లోజ్ఞుడని కూడ చెప్పఁబడినది. నన్నయ రచనలో ఈ లోకజ్ఞత పెక్కుచోట్ల ప్రస్ఫుటముగా గోచరించును. శర్మిష్ఠదేవయానిని నూతఁద్రోయించి నగరమున కరిగెను. తరువాత పిపాసార్తితుడై యయాతి యచటి కరుదెంచి నూతిలోనున్న దేవయానిని జూచి "నీవెవ్వరవు? నూతిలో నుండుటకు కారణమేమి?"అని యడిగెను. సత్యము చెప్పినచో న్యూనతాపాదకముగా నుండునని దేవయాని ప్రమాదవశమున తానందు పడినట్లాతనికి తెల్పియుండెను. ఇది నన్నయ లోకజ్ఞతకొక నిదర్శనము. దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టిన వలువలొలువఁ బూనినప్పుడు నానారాగ విరాగములైన వస్త్రములామె జఘనమున విరాజిల్లెనని సంస్కృతమునందున్నది. నన్నయ వివిధ వర్ణముల వస్త్రములని చెప్పక "ఉడుగక ఒలువంగఁబడియు మున్నపనీతమైన తద్వస్త్రంబు నట్టివలువ లలితాంగి జఘనమండలమునఁబాయక నొప్పుచునున్న నయ్యువిదఁజూచి" అని వ్రాసియుండెను. ఒకే రకమైన వస్త్రము మరలమరల నుత్పన్నమగుచో నగ్నతతోపదని లోకజ్ఞుడైన నన్నయ అట్లు వ్రాసియుండెను. ఇచ్చట వాడఁబడిన పాయక అను పదము సాభిప్రాయము. అనగా ఎడతెగక యని యర్థము. దమయంతి నడవిలో నజగరము పట్టుకొన్నప్పుడు కిరాతుఁడాపాము ముఖము వ్రయ్యఁ దఱుగ దమయంతి సజీవయ్యె బయటికరుదెంచెను. కిరాతు డామెనోదార్చి చెంతనున్న చెఱువులో స్నానముచేసి రమ్మనెను. పాము మ్రింగి నప్పుడామె శరీరమున అంటుకొనిన లాలాజలము తొలగుటకై యాతడట్లు చెప్పి యుండెను. స్నానముచేసి వచ్చిన దమయంతి అపూర్వ సౌందర్యమును చూచి కిరాతుఁడు మదన పరవశుఁడయ్యెను. సార్థము తెల్లవారు జామున ప్రయాణ మారంభించి ఎండ యెక్కునంతవఱకు నడచి నీరున్నచోట చెట్లనీడ విశ్రమించుట లోకమున పరిపాటి. నన్నయ నలోపాఖ్యానమున సరిగా నీక్రమమునే వర్ణించెను.

దమయంతి నలుని విదర్భకు రప్పించుటయందును, నలుని రథఘోషము విని అది నలునిదేయని గుర్తించుటయందును ఆమె యపారమైన లోకజ్ఞత వెల్లడియగుచున్నది. ఈ లోకజ్ఞత నన్నయగారిదే.

నన్నయ మనస్తత్వ నిరూపణము :-

నన్నయ తన రచనలో నాయా సందర్భములందు ఆయాపాత్రల మనస్తత్వమును చక్కగా వ్యక్తము చేసియుండెను. ఏకచక్ర పురమున పాండవులు నివసించిన బ్రాహ్మణునికి బకాసురుని కాహారము పంపు వంతు వచ్చినప్పు డా బ్రాహ్మణుడును, అతని భార్యయు, కూతురును నేనుపోయెద నేను పోయెదనని పలుకుచు దుఃఖించుచుండిరి. అప్పుడు బాలుఁడొకఁడు చిన్నకోల చేతఁబట్టుకొని నేను రాక్షసునవలీలగా చంపి వత్తును మీరేడ్వవలదని వచ్చియురాని పలుకులతో వారినోదార్చెనని నన్నయ వ్రాసియుండెను. ఇంటివారికి కలిగిన ఆపద అనివార్యతకాని, రాక్షసుని బలముకాని తెలియని బాలుని మనస్తత్వమునిది చక్కగా వెల్లడిచేయుచున్నది. ధర్మరాజింద్రప్రస్థమున రాజ్యము చేయుచుండ దొంగలొక విప్రుని హోమధేనువు నపహరించిరి. ఆ విప్రుడు దుఃఖించుచువచ్చి "వదలక ముచ్చుల వధియించి నా హోమధేనువుఁ గ్రమ్మర తెచ్చియిమ్ము. జననుత! దాని వత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచు నున్న యదియు" అని పల్కినట్లు నన్నయ వర్ణించెను. ఆతడిచ్చట వత్సముయొక్క పరిస్థితిని సహజముగను కరుణ రసపూరితముగను వర్ణించియుండెను. దుర్యోధనుడు ద్రౌపదిని సభకుఁగొని రమ్మని దుశ్శాసనుని బంపినపుడు ద్రౌపది భీతయై గాంధారి యొద్దకు నరిగినట్లు నన్నయ తెల్పెను. స్త్రీలు మానభంగ భయముదయించినప్పుడు రక్షణాపేక్షచే అన్యస్త్రీల మఱుగు చొచ్చుటయు, గాంధారికి నివారించు శక్తియుండుటయు స్త్రీలున్న చోటికి దుశ్శాసనుడురాడని యూహించుటయు ఆమె అట్లు చేయుటకు కారణము. స్త్రీ స్వభావమును గుర్తించియే నన్నయ యిట్లు వర్ణించెను. విదితయైన దమయంతిని నలుడు విడిచిపోవు పరిస్థితిని నన్నయ

కలిదనుయంతిఁ బావ సమకట్టు నతింబతి వాయునోవఁ డా
లలన నుదీర్ణసౌహృదబలంబున నిట్టులు రెంటఁజేసి య
న్నలుడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యెలయునుబోలె నూఱడక యెంతయుఁబొద్దు వినిశ్చితాత్ముఁడై.

అను పద్యమున వర్ణించియుండెను. గతాగత కారియైన యుయ్యెలయును బోలె అను నుపమానము నలుని మనః పరిస్థితిని చక్కగా వెల్లడిచేయుచున్నది. ప్రియురాలిని

విడిచిపోవు నలుడు పొందిన వ్యథ ఇందద్భుతముగా వర్ణింపఁబడినది. ఉద్యానమున విహరించుచు నలుడొక హంసను పట్టుకొనగా ఇతర హంసలు దానిని విడిచి పోనొల్లక అఱచుచు అంతరిక్షమున పిండుకట్టి తిరుగుచుండెనని నలుడు వర్ణించెను. ఈ సందర్భమున పక్షి స్వభావమును అత్యంత సహజముగా సన్నయ వర్ణించియున్నాడు. ఈ విధముగా సన్నయ రసపాత్ర పోషణమునందును, లోకజ్ఞతా ప్రకటనమునందును మనస్తత్వ నిరూపణమునందును అనన్యసాధారణమైన నేర్పు ప్రకటించి కాలము చేతనేకాక కవితా కౌశలముచే కూడ అగ్రగణ్యుడై విలసిల్లుచున్నాడు.

*   *   *   *

ఒక చింతామణి నీవు వ్రాసితివో లేదో యంచు విద్వాంసులూ
రక వాదంబులపైని వాదము లొనర్పం జింతయౌ నాంధ్రమం
దకలంకంబుగ నీవు వ్రాసినకృతన్ సార్థత్రిపర్వంబునన్
బ్రకటత్వంబు వహింపవే శతసహస్ర ప్రాజ్యచింతామణుల్

ఎట్టెటులో శ్రమంపడి యహీనమతిప్రభఁ దెల్గు కైతకున్
బట్టగు కావ్యసౌధము పునాదులు తీర్చితి సుస్థిరంబుగాఁ
గట్టిరి దానిపై సొగసుఁ గట్టడముల్ కవిరాజులంత నీ
పెట్టిన భిక్షగాదె సుకవిప్రకర ప్రణుతోక్తి వైభవా !

*   *   *   *

# 8. నన్నయ శైలి, అక్షర రమ్యత

అవతారిక యందలి సారమతింగవీంద్రులను పద్యమున నన్నయ తన కవితాగుణములతో అక్షర రమ్యతకూడ ఒకటి యని పేర్కొనియుండెను. కొంద అనుకొనునట్లక్షర రమ్యత కేవల సరళాక్షరఘటిత పదప్రయోగము చేతనే ఏర్పడదు. అది రసానుకూలమైన పదప్రయోగముపై ఆధారపడి యుండును. రౌద్రరసమును వర్ణించునప్పుడు పరుషాక్షరములతో కూడిన పదములను కరుణశృంగారములను వర్ణించినప్పుడు సరళాక్షరములతో గూడిన పదములను ప్రయోగించుట వలన అక్షరరమ్యత ఏర్పడును. పదముల అన్యోన్యత మైత్రిని శయ్య యందురు. పింగళి సూరన "పొసగము తెప్ప సొరుల్ పోహళించినరీతిఁ దమలోన దొరయు శబ్దములు కూర్చి" కవిత రచింపవలెనని చెప్పి రచనలో శయ్యాసౌభాగ్యముండవలెనని సూచించెను. మాల గ్రుచ్చువాడే పూవు తరువాతనే పూవుగ్రుచ్చుచో సుందరముగా నుండునో గ్రహించి పువ్వుల నమర్చునట్లు, కవి ఏ పదము తరువాత నేపదము వాడినచో సుందరముగా నుండునో గ్రహించి పదప్రయోగము చేయవలెను. పదము లొండొంటితో పొందిపొసగి యుండుటవలన రమ్యమైన శయ్య ఏర్పడును. అక్షర రమ్యత ఆ శయ్యయందలి యొక భాగము. నన్నయ కవిత్వముననది సర్వతో ముఖముగా నొప్పారుచుండును. "పతదుర్వీధర ధాతునిర్ఝర జలాభంబై (ఆది 2-24) అను పద్యమునందలి సంయుక్త మహాప్రాణాక్షరములు ఓజోగుణమును సూచిచించు రౌద్రరసమున కనుగుణములుగా నున్నవి.

"గంగ నిజాంగదీప్తకెనఁగంజనుదెంచి లతాంగి సంతతోత్తుంగపయోధరద్వితయ" అనుచో బిందు పూర్వకగకారముతో కూడిన పదముల కూర్పు సౌకుమార్యమును, " ఎందులదానవేకతమ యియ్యమునానది యోడరేవునన్ " అను శృంగారరసమును వర్ణించు పద్యము పృథక్పదత్వముతో కూడి మాధుర్య గుణమును సూచించుచున్నది. వామనుడోజోగుణమిశ్రితమైన ప్రసాదమే గుణమనియు, కొన్నిచోట్ల ప్రసాదముకంటె నోజస్సును. కొన్నిచోట్ల నోజస్సుకంటె ప్రసాదమును అధికముగా నుండుననియు తెల్పెను. "ధారుణి రాజ్యసంపద మదంబునఁగోమలిఁ గృష్ణజూచి దంభోరునిజోరు దేశమున (స. 2-247) అను పద్యమునందోజస్సధికము. ఓజ. ప్రసాదగుణసామ్యముతో కూడిన పద్యములు కూడ నన్నయ రచనలో ననేకములున్నవి. రసానుగుణముగా పదవర్ణనముల వాడియు, పరివృత్త్యసహిష్ణువు

లైన పదముల ప్రయోగించియు నన్నయ తన రచనలో శయ్యాసౌష్ఠవమును అక్షర రమ్యతను కల్పించుచుండును.

నన్నయకు ముందాతనికి మార్గదర్శకములైన కావ్యములాంధ్రమున లేకుండెను, అందుచే సంస్కృత కావ్యములును, పంపాదులు రచించిన కన్నడ కావ్యములును ఆతనికాదర్శప్రాయములయ్యెను. అతడు సంస్కృత పదములను సమాసములను అధికముగా వాడియుండెను. అయినను పాండిత్యప్రకర్షకై అతడు మాఱుమూల పదములనెచ్చటను ప్రయోగింపడు అది అతని రచనలోని పిశిష్టత. తెలుగు కవులలో సంస్కృత సమాసభూయిష్టమైన రచన కావించిన వారెందఱో కలరు. కాని అతనివలె మృదుమధురపదబంధములుగను అక్లిష్టాన్వయములుగను సమాసములను కూర్చినవారి సంఖ్య చాల తక్కువ.

నన్నయ రచనలో వీనులకు విందు కూర్చుధ్వని(నాద) గాంభీర్యము పెక్కుచోట్ల కనిపించును సంహితాభ్యాసుడౌటచేఅతని రచనలో కొన్ని ఘట్టము లందలి పద్యములు వేదబుక్కులవలె ధ్వనించుచు శ్రవణసుభగములుగానుండును. ఉదంకుడు నాగరాజులనుస్తుతించిన పద్యములును, వర్షాశరద్వర్ణన సందర్భము నందలి పద్యములును (అర 3-137-142) ఇందుకు నిదర్శములు. అతని రచనలో సంస్కృత వాక్యయోజనయు, ప్రత్యర్థక శబ్దములతో కూడిన వాక్యములును పెక్కుచోట్ల కనవచ్చును. అతడు సంస్కృతమునవలె విశేషణములను విశేష్యముల ముందును వెనుకను కూడ వాడుచుండును. వాని నడుమ కొన్నిచోట్ల నితర పదముల వ్యవధానము కూడ గోచరించును. అయినను అతని రచనలో అన్వయ క్లేశమెచ్చటను కానరాదు. అందులో కర్మణిప్రయోగము లచ్చటచ్చట నుండును. సంస్కృతమున నా ప్రయోగమునకు వాడుకయు జాతీయతయు హెచ్చు.

నన్నయదాలంకారికమైన రచన, అందలంకారముల ప్రయత్నసిద్ధములును ధారాళములోను సహజములనై యొప్పారుచుండును. ఉపమ, రూపకము, స్వభావోక్తి అర్థాంతరన్యాసము అనునలంకారములతని రచనలో నధికముగా కనిపించును. "సాత్యవతేయ విష్ణుపద సంభవమై" (ఆది 1 72), "అమితాఖ్యానక శాఖలంబొలిచి" (ఆ 3-21) మున్నగునవాతని సంపూర్ణ రూపక రచనకు నిదర్శనములు. అతడు వాడిన అర్థాంతరన్యాసములు పెక్కడు కల్పించినచే. వానిలో నతడు సాధారణముగా నీతులను కూడ చొప్పించుచుండును. అతని స్వభావోక్తులు సహజములును రమ్య

ములునై యుండును. "తలవడఁకఁదొడఁగె నింద్రియముల గర్వమణంగె" (ఆది. 3.91) "అన్న సహదేవ నీవును నన్నలతో నరిగెదయ్య" సభా (2.288) మున్నగునవిందుకు దృష్టాంతములు. అతని ఉపమాలంకారములు సందర్భోచితములై భావగంభీరములుగ నుండును. "అగ్నిశిఖయుఁబోలె నంటనుడాయను జూడరానియట్టి శుభచరిత్ర" (దమయంతి అర 2.90), "అంబుధి విమలతోయంబులాస్వాదింపఁజనుదెంచు జలధర నమితి యట్ల" (గజయూధములు అర, 2.110) మున్నగు రమ్యమైన ఉపమానములాతని రచనలో లెక్కకు మిక్కిలిగా కనిపించును.

'విగత జీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁడై వెలింగె
దనుజయంత్రి యుచ్చారణదక్షు చేత
నభిహితంబగు శబ్దంబు నట్లపోలె (ఆది. 3.127)

అను పద్యము కచుడు శుక్రుని పునర్జీవింపఁజేసిన సందర్భములోనిది. ఇచ్చటి ఉపమానము అపూర్వమై నన్నయ శబ్దబ్రహ్మవేత్తృత్వమును చక్కగా ప్రకటించుచున్నది.

నన్నయ మూడు నాలుగుచోట్ల ఉపమాలంకారములతో కూడిన శ్లేషాలంకారములను వాడియుండెను. "ఉద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతబైన దాని" (ఆది. 2.27) ఇత్యాదిగాఁగల వచనమునందలి శ్లేషసభంగము నభంగమునై రమణీయముగా నున్నది. వసువులు రుద్రులు వసుహీన విఫలక్రియ దక్షిణాశ్రితులైరి భీతి" (ఆది. 2-99) అనుచోట దక్షిణాశ్రితులనగా దక్షిణ దిక్కును ఆశ్రయించిరనియు, ధనరూపమైన సంభావననాశ్రయించిరనియు రెండర్థములు కలవు, "అలఘుతరంబులై తుహినహారి సుధారుచి- (ఆది. 8.77) అను ఖాండవప్రస్థ వర్ణనమునందలి పద్యమును, "భూనతికిన్ దివంబునకుఁ బొల్పెనగంగ........అబ్జజా యానముతో నమానమై" అను శరద్వర్ణనమునందలి పద్యమును శ్లేషమహిమచే నుపమానోపమేయములు రెండింటితో నన్వయము కలిగియున్నవి.

నన్నయ రచనలో అచ్చటచ్చట శబ్దాలంకారములు కూడ కనిపించును. వీనిలో వృత్త్యనుప్రాసములసంఖ్య అధికము. "నటానముత్పాటన కుపితకుంజరవైరి యుంబోలెఁగడు నలిగి పటుకుటిల భ్రుకుటి ఘటిత నిటలుం డగుచు" (సభా 1-194) అను వచనము నందలి టకారముతో కూడిన అనుప్రాసము జరాసంధుడు.

కోపమున పండ్లు పట పట కొఱుకుచున్నాడా అను భావమును చక్కగా వ్యక్తము చేయుచున్నది.

ఘోర వనమున వీరుఁ గిమ్మీరుఁడను సు
రారి నిశ్చల భీకరాకారుఁబట్టి
పోర వధియించి నట్టి సమీరజునకు
భూరి భుజునకు మార్కొనువారు గలరె?

అను పద్యమునందలి రకార పునరావృత్తి తేటగీతిలో కూడ ప్రాస సౌందర్యమును కల్పించుచు శ్రవణరమణీయముగా నున్నది. "వడిఁబడియెఁ బిడుగు లుడుగక వడఁకె మహీతలము" (అర. 3-369) అను వాక్యములందలి దుష్కరాన్ప్రాసము పిడుగుపాటు నందలి ధ్వనిని స్మరింప చేయుచున్నది.

అఱ పొఱడు కుఱుచ చేతులు
నొఱవశరీరంబు గలిగి మొరులకుఁజూడం
గొఱగా కుండియు మన్మథు
నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుడై (అర 2-134)

అను పద్యమునందలి ఱకారపునరావృత్తి బాహుకుని వికృతాకారమును చక్కగా వ్యక్తము చేయుచున్నది. "అనిలజున్ రాజీవరాజీవ సత్సమదాళివ్రజ చక్రవాక ఒక హంస క్రౌంచనాదంబులన్ అనుచోట ( రాజీవ రాజీ+వసత్ ) యమకాలంకార మున్నది.

నన్నయ తన రచనలో నాలుగైదుచోట్ల శబ్దములకు గల రెండర్థములను పురస్కరించుకొని చక్కని చమత్కారము కల్పించియున్నాడు. అస్త్రవిద్యా ప్రదర్శన సందర్భమున ద్వంద్వయుద్ధమొనర్చుచున్న కర్ణార్జునుల నడుమ నిలిచి కృపుడు "దొరయగు దేని నీ కెదిరి దోర్బలశక్తి నితండు చూపెడిన్" (ఆది. 6-44) అని పలికియుండెను. "దొర"అను పదమునకు రాజు, సాటి అను రెండర్థములున్నవి. నీ వర్జుననితో సమానుడవగుదేని అని కృపుని అర్థము. దుర్యోధనుడు రాజను నర్థము గ్రహించి కర్ణుని అంగరాజుగా నొనరించెను. ఇందొక విధమైన వక్రోక్తి యున్నది. "అన్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియైన యుయ్యేలయును బోలె" (అర. 2-78) అనుచోట దమయంతిని విడిచిపోవు నలుడు గతాగత కారియైన యుయ్యేలవలె నుండెనని వర్ణింపఁబడినది. ఇచ్చట విమోహమనఁగా విశేషమోహ

మనియు, విగతమోహమనియు రెండర్థములు చెప్పవలయును. అట్లు చెప్పనఁగాని ఇచ్చట ఉపమానము సరికాదు. అర్జునుడు శివుని వలన పాశుపతాస్త్రమును పొంది నప్పుడతని చూచి దేవదానవులు భయపడిరను సందర్భమున నన్నయ ధనంజయ ప్రవరుకరమ్మునన్ వెలుగు పాశుపతాస్త్రము చూచి యని వ్రాసి యుండెను. ధనంజయ శబ్దమునకు అగ్ని, విష్ణువు అను అర్థములున్నవి పాశుపతాస్త్ర లాభముచే అర్జునుడు ధనంజయులలో ప్రవరుడయ్యెనని నన్నయ ఉద్దేశము.

పెక్కుచోట్ల నన్నయ సాభిప్రాయములైన విశేషణములను వాడి యుండెను. శకుంతల "నుతజలపూరితంబులగు నూతులు నూఱింటికంటె సూనృత వ్రతః యొక బావిమేలు" అని దుష్యంతుని 'సూనృతవ్రత'యని సంబోధించెను. స్థూలముగా చూచిన ఇది సత్యవ్రతయను నర్థముననే యిచ్చుచున్నను సందర్భమునుబట్టి వ్యతిరేకార్థ స్ఫూర్తిని కూడ సూచించుచున్నది. మూలమున దుర్యోధనుడు భీముని 'వృకోదర' అని సంబోధించెను. నన్నయ దానిని మార్చి 'అనిలజః నీకెట్లని పలుకను దలపనునగునె' అని అనిలజ శబ్దమును ప్రయోగించెను. ఇందు నీవు పాండురాజునకు కాక వాయువునకు పుత్రుడవను ధ్వని యున్నది. పాండవులు ద్రౌపదిని చూచి మన్మథవికారమునకు లోనైరను తెల్పు సందర్భమున నన్నయ "ఆలలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండు భూపాల తనూజ పంచకము పంచశరాహతిఁబొందె" అనుచోట పంచక, పంచశర శబ్దములు సాభిప్రాయములు. అట్లే భీముడు జరాసంధుని సంహరించు సందర్భమున "వాతసుతుండు వీచె తృణఖండనముండగు చండ మాగధున్" అని వాతసుత-తృణఖండశబ్దములను వాడుటయు, ఈర్ష్యాగ్రస్తుడగు దుర్యోధనుడు అగ్నిలో పడి మరణింతునని చెప్పు సందర్భమున అగ్నికి "సర్వభక్షక" శబ్దము వాడుటయు సాభిప్రాయములై సందర్భోచితములైన అర్థములను చక్కగ సూచించుచున్నవి.

దుర్యోధనుని ఆజ్ఞచే ప్రాతికామి తన్ను సభలోనికి గొనిపోవుటకు రాగా ద్రౌపది "మున్ను తన్నోటు వడి" అను పద్యమమున "అన్న! నా కెఱుఁగఁజెప్పు" మని అడిగినట్లు నన్నయ శబ్దమును వాడియుండెను. ఇచ్చట నీ సంబోధన మెట్టి కఠిన హృదయులనైన కరగించుననుటలో సందేహములేదు. సౌంభకాఖ్యానమున ప్రద్యుమ్నుడు మూర్ఛితుఁడు కాగా సారధి రధమును రణభూమికి దూరముగా కొనిపోయెను. మూర్ఛనుండి తేరిన ప్రద్యుమ్నుడు సూతునితో

విక్రమము విడిచి సమరా
వక్రాంతుఁడనైన నన్ను బలదేవుడునున్
జక్రధర సుతులు ననుజులు
నక్రూరాదులును నేమియని నగరెసభన్.

అని పలికెను. ఇందలి ఏమి అని నగరె అను పదములు గంభీరములైన అర్థమును స్ఫురింపఁజేయుచున్నవి. అర్జునుడు గురుదక్షిణగా ద్రుపదుని కట్టి, తీసికొని వచ్చినప్పుడు ద్రోణుఁడతనినిఁ జూచి

"వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె, యిట్లు కృపణులై పట్టువడన్
వీరికి వలసెనె, యహహా! మ
హారాజ్య మదాంధకారమది వాసెనొకో"

అని పలికిన వాక్యములు నాటకోచితములై ద్రోణుడు కావించిన హేళనమును ప్రకటించుచున్నవి. ద్రౌపది సభలోనున్న పెద్దలను చూచి, "నేను దాసినా అదాసినా" చెప్పుఁడని అడుగ భీష్ముఁడు "అవ్వా! నీ ప్రశ్నంబున కుత్తరంబయ్యుధిష్ఠిరుండ చెప్పవలయునని పలుకుచు" అవ్వా! అని సంబోధించుట అతని కామె యెడఁగల వాత్సల్యమును సువ్యక్తమొనరించు చున్నది.

ఆస్తీకుడు సర్పయాగము నుడిగింపుమని కోరుచు జనమేజయునిస్తుతించిన పద్యములును, శిశుపాలుఁడు కృష్ణుని నిందించుచు పలికిన పలుకులును వారు పద మయోపన్యాసము లిచ్చుచున్నారా అను తలంపు కలుగఁజేయుచున్నవి.

కొన్నిచోట్ల నన్నయ అనవసరముగా రెండు మూడు సంబోధనలు కూర్చుచుండును. "గురు భుజుండ! నాకు గుర్తెని చేసుకమయ్యా యిట్టి చెయ్యులనఘయింక" మున్నగునవి యిందుకు దృష్టాంతములు. గరుడుఁడు తల్లిని పయోరుహాననా! అని సంబోధించుటయు, అస్త్రవిద్యాప్రదర్శనము నాటికి కర్ణుడు కానీనుడని తెలియక పోయినను అర్జునుడు కానీనుడని సంబోధించుటయు. ఔచిత్యదూరములై యున్నవి. అతడక్కడక్కడ పద్యములలో 'మానుగ, తగలి, యిమ్ముల, రమణ' అను పదములను పాదపూరణమునకై వాడుచుండును. అతడు తెలుగున పద్యమునకు వలెనె గద్యమునకు కూడ ఆద్యుడని భావింపవచ్చును. సంభాషణ సందర్భములందు చిన్నచిన్న వాక్యములతో కూడియు. వర్ణన సందర్భములందు సంస్కృత సమాసము

లతో కూడియు అతని వచనము మిక్కిలి ధారళమై సరసముగా సాగుచుండును. వినతాకద్రువల సంభాషణమును (ఆది-2.31) నలకర్కోటకుల సంభాషణమును (అర. 2-27) ఇందుకు నిదర్శనములు. ద్రౌపది ధర్మవిజితయా, అధర్మవిజితయా అను సందర్భమున కర్ణుడును, వికర్ణుడును పలికిన పలుకులు హేతువాదపూర్వకములై వాదిప్రతివాదుల పక్షముల నవలంభించి న్యాయవాదులు వాదించు పద్ధతిని తలపించుచున్నవి. అరణ్యపర్వమునందలి వచనములలో విషయప్రధానములైన వాని సంఖ్య హెచ్చు. అవి అలతి అలతి వాక్యములతోగూడి ఆయా విషయములను విశదముగా వర్ణించుచుండును. సాధారణముగా విమర్శకులు కథనశైలి, వర్ణనశైలి, సంవాదశైలి అని మూడు తెఱఁగులుగా ఉండునని చెప్పుదురు. నన్నయ పెక్కుచోట్ల కథకుడు కథ చెప్పునట్లుగా తటస్థుడై కథలను సాగించుచుండును. పుత్రవియోగ దుఃఖితుడై వశిష్ఠుడు ప్రాణత్యాగము చేయదలచిన సందర్భమున వ్రాయబడిన పద్యములలో కథనవేగము రమ్యమై గోచరించును. ఇతని రచనలో వర్ణన అచ్చటచ్చట సంవాదశైలిలోకూడ లేకపోలేదు. సౌగంధికాపహరణ సందర్భమున హనుమద్భీములు సంభాషించుకొనుటయు, బకాసురుని కాహారముగా నేను బోయెద నేను బోయెదనని చెప్పుచు తల్లిదండ్రులును కూతురును వాదించుటయు సంవాద శైలికి తార్కాణములు. అతని రచనలో పద్యమునందైనను ధారాశుద్ధిసర్వతోముఖముగా గోచరించును. 'మదమాతంగ తురంగ కాంచన (సభా 1-18) 'శారదరాత్రులుజ్జ్వల' (అరణ్య 4-142) 'వివిధోత్తుంగ తరంగ ఘట్టన' (ఆది 2-30) మున్నగు పద్యములను చూచినచో నీ విషయము తేటతెల్లమగును. ఇవేకాదు అతని రచనయందలి ఏ పద్యమైనను ఇందుకు తార్కాణమే.

నన్నయ మార్గసంప్రదాయమునందభిమానము కలవాడైనను కొన్నిచోట్ల దేశి సంప్రదాయ లక్షణములను కూడ ప్రదర్శించియున్నాడు. అతడు దేశీయములైన వేష సంప్రదాయములను వర్ణించినచోట్లు అనేకములు కలవు. ఆంధ్రదేశ జన వ్యవహారమున గోచరించు పలుకుబడులు, సామెతలు, నానుడులు అతని రచనలో విరివిగా కనిపించును. ఇప్పుడు ప్రొద్దులేదు. రేపకడ చూతము, వినురోయుతీగ కాళ్ళంబెనగె దాననుచు, కుంతి కడుపు చల్లగాఁబుట్టిన ఘనపుజుండు, వంటయిల్లు కుందేలు సొచ్చె మున్నగునవి యిందుకు దృష్టాంతములు.

నన్నయ అరణ్యపర్వాశ్వాసాంతములందు రమ్యరమణీయ శబ్దములను, సభాపర్వ ప్రథమాశ్వాసాంతమున రసోత్కట శబ్దమును, ఆదిపర్వ తృతీయాశ్వాసాం

తమున అనంత పుణ్యఫలాయత్త శబ్దమును స్వరచన పరముగా వాడియుండెను. అరణ్యపర్వమున నలోపాఖ్యానము, కిరాతార్జునీయము ఋశ్యశృంగుని కథ, సౌంభకోపాఖ్యానము మున్నగు రసవంతములైన ఘట్టములు అచ్చటచ్చట కానవచ్చును. అయ్యును అతడు ఆశ్వాసాంతములన్నింట రమ్య రమణీయ పదములలో నొకదానిని వాడుటకు అందలి కథలను వ్రాయునప్పుడాతడు వానిని రమణీయముగా తీర్చిదిద్దుటకై ఎక్కువ శ్రద్ధ వహించుటయో, తీర్థాదివర్ణనముల పట్లకలుగు శుష్కతను తొలగించనెంచుటయో కారణమగును. నన్నయ ఆదిపర్వమును రచించి వేగియందలి పండిత పరిషత్తునకు వినిపించియుండుననియు, అందలి పండితులు కావ్యము రమణీయార్థ ప్రతిపాదకముగా నుండవలెనని అభిప్రాయపడి యుందురనియు, అందుచేతనే అతడు తాను తరువాత రచించిన ఆశ్వాసాంతముల చివర రమణీయ రమ్యశబ్దములను ఉద్దేశపూర్వకముగా వాడియుండుననియు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు అభిప్రాయపడియున్నారు.

ఎఱ్ఱన హరివంశమున

"ఉన్నతగోత్ర సంభవము నూర్జితసత్త్వము భద్రజాతి సం
పన్నమునుద్ధతాన్యపరిభావి మదోత్కటమున్న రేంద్ర పూ
జోన్నయనోచితంబునను యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతినెందును గ్రాలుట ప్రస్తుతించెదన్."

అని నన్నయను భద్రజాతి కుంజరముతో పోల్చియుండెను. అతని పద్య గద్యములలో వేనిని చూచినను గంభీరసుందరమైన గజగమనము గోచరించుచునేయుండును.

యౌవనమందు మత్తగజయానము కన్నెల కబ్బునంచు సం
భావన చేయు చంద్రుదు కవివర్యులు నీ మహనీయ శిక్షణ
శ్రీవిభవమ్ముచే సుకవి శేఖరుపుట్టియుఁ బుట్టకుండనే
యావిలనద్గతి క్రమము లబ్బిన వాంధ్రకవిత్వకన్యకున్

# 9. నన్నయ భాషా ఛందోవిశేషములు :

తలకులబ్రాహ్మణనను పద్యమున నన్నయ తనకు విపులశబ్దశాసనుడను విశేషణము వాడుకొనియుండెను. అతనికి శబ్దశాసనుడను బిరుదము తరువాత స్థిరపడినది. అతడాంధ్రశబ్దచింతామణిని వ్రాసెనా లేదా యను విషయమున పండితులలో భిన్నాభిప్రాయములున్నవి. అతడా వ్యాకరణమును రచించినను, రచింపక పోయినను, అంతకు పూర్వమవ్యవస్థితమైయున్న ఆంధ్రభాషకు సుందరము, సుస్థిరమునైన రూపునొసంగుట వలననే అతనికాబిరుదము కలిగినదని చెప్పవచ్చును. అతడు సంస్కృతవాఙ్మయమునంతను పఠించిన వాడగుటచే అందున్న పదములకు తత్సమరూపమునొసగు విధానము నిర్ణయించి ఆంధ్రభాషకు ఎట్టి ఉన్నతభావములనైన వ్యక్తీకరించు సామర్థ్యముకల విస్తృతసుందరమైన రూపమును తీర్చి దిద్దెను.

నన్నయ తనకు పూర్వమున నున్న శాసనములలో కానవచ్చు ఱ, ఴ అను ధ్వనులను తొలగించినట్లు కనబడును. అతడు సంయుక్తాక్షరములలో శకటరేఫమును పరిహరించెనని కూడ చెప్పవచ్చును. తమిళమున ట్ర అను ధ్వనితో నుచ్చరింపబడు అక్షరములు క్రమముగ తెలుగున ద్విత్వరేఫముగా మారియుండెను. నన్నయ తన రచనలో క్షకారమునకు కకారాదులతోడను, జ్ఞ అను దానికి జకారాదులతోడను మాత్రమే పెక్కుచోట్ల యతివేసి యుండెను. అద్రుచు, విద్రుచు అను ధాతువుల రూపములందేకాక సంస్కృతసమాసములతో కూడ రేఫయుక్తములగు సంయుక్తాక్షరములకు వెనుకనున్న అక్షరములు కొన్నిచోట్ల లఘువులుగా కనిపించును. 'నక్షత్రయుక్తుండుగా', 'శశిప్రకాశజయోన్నతమైన అష్టమిన్' (ఆది 5-94) మున్నగునవి యిందుకు తార్కాణములు. పదమధ్యాంతములందలి న, ల అను ఇత్వములుగా నుచ్చరించు అలవాటు నన్నయ నాటికి అంతరించెను.

నన్నయ భారతములో పేర్వాదిశబ్దముల కచ్చు పరమైనప్పుడు టుగాగమము వచ్చిన రూపములు కనబడవు. అతడు 'ఉండునది' యను విధ్యర్థక క్రియా రూపమును 'ఉన్నది'యని వ్రాసియుండెను. 'ఉండు'నకు పూర్వరూపమైన 'ఉను' అను దానినుండి ఈ రూపమేర్పడి యుండును. "విప్రసతికి నూఱువేదఱజన్వరములు"అను ప్రయోగమున 'చనును' అను తద్ధర్మరూపమునందలి 'ను' ప్రత్యయమునకే కాక ధాతువునందలి ఉత్తునకుఁ గూడ లోపము గలిగినది. నన్నయ 'అయ్యు' అను

రూపమును వాడియుండెను. ఆయి+ఉ=అయి+యు అను రూపమునందలి క్త్వార్థకేకారమునకు లోపము కలిగించి అతడా రూపమును వాడియుండును. అతడు 'ఓటమి, ఆనతి' మొదలగువాని యందలి యిత్తునకచ్చుపరమగునపుడు సంధిచేసి యుండెను. అతని రచనలో రెండు మూడుచోట్ల ద్రుతద్విత్వసంధి కూడ కనవచ్చును. 'ధైర్యశక్తికిన్నరుదుగ' (అర 1-322) అనునది అందుకొక నిదర్శనము.

నన్నయ 'మిత్ర పాత్ర' శబ్దములను పుంలింగ తుల్యములుగనే వాడియుండెను. 'ప్రేమ, కర్మ, జన్మ' అను మువర్ణములేని రూపముల నతడు వాడియుండలేదు. 'అర్థ, ధర్మ' శబ్దములను అతడు అర్థువు, ధర్మువు' అను రూపములతో వాడి యుండెను. బయలు, ప్రొద్దు, మన్ను అను పదము లతని రచనలో అనాపవిభక్తిక ములుగా కనఁబడుచున్నవి. అల్లుడు, మల్లుడు, నెయ్యుడు అను బహువచన రూపములలో లు వర్ణమునకు డు అను బహువచన ప్రత్యయము కలదు. అల్లుడు మొదలగువాని ఏకవచన రూపములు దీర్ఘపూర్వలోపధములు కావు. నన్నయ గుఱించి చేసి (చేత) మై, పొంటె అను వానిని విభక్తి ప్రత్యయములుగా వాడియుండెను. అట్లే తదర్థము అనునది అతని రచనలో చతుర్థీ విభక్త్యర్థమున వాడబడినది. చతుర్థీ విభక్తిప్రత్యయముగా అతడు కు+ఐ=కై అను దానినే కాని,కొఱకు అను ప్రత్యయ మును వాడియుండలేదు. సమానాన్వయము కల పదములనేకములున్నపుడు తో, తోన అను ప్రత్యయములను అతడు చివరి పదమునకే చేర్చుచుండును. "ఆపగా తనూజుఁడఖిల బాంధవులయు బ్రాహ్మణులయుఁదోడ భానునిభుఁడు" (ఆది 4-216) ఇచ్చట తోడకు వ్యస్తప్రయోగము. ఇట్లే అతడు ఆందు అను దానిని స్థలార్థమున పలుచోట్ల వ్యస్తముగా వాడియుండెను.

నన్నయ సర్వనామములలో ఉత్తమపురుష ఏకవచమున ఏను అనురూపమునే విరివిగా వాడినను బహువచనమున ఏము మేము అను రెండు రూపములను వాడియుండెను. వాడు, వీడు, అది అను సర్వనామములు అతని రచనలో నీచార్థ ముఁనగాక సామాన్యార్థముననే గోచరించుచుండును. ఎవ్వరైన అనునర్థమున అతడు స్త్రీ పురుషోభయ సూచకముగా 'ఎయ్యేని' అను పదము వాడుచుండును. ఎవ్వరు+ఏని=ఎయ్యేని అగుట కవకాశమున్నది. అతడు ఒక్కరుడు అను రూపమును మహద్వాచకముగాను, ఒకడు అనురూపము అహహద్వాచకముగాను వాడుచుండును. అతని రచనలో కొండొక అనురూపము కొంత, ఒకానొక అను

నర్థమున వాడబడుచుండును. అయిదు అను దానికి ఏను అనురూపమును, మొదటి అనుదానికి మొదలిటి, మొదలింటి అను రూపములును, ఎనిమిది, తొమ్మిది వేయి అనువానికు క్రమముగా ఎనమ, తోమ్మ, వే అనురూపములను అతడు వాడు చుండును. అతడు మహన్మహతీ వాచకములను చెప్పు సంఖ్యావాచకములకు 'వురు' అను దానిని, పూరణార్థమున అగు, అవు అను దానిని వాడుచుండును. నన్నయ పెక్కురు అనుటకు పెక్కండ్రు పెక్కండ్రురు అను రూపములను ప్రయోగించు చుండును. ఎల్లరు అను రూపమతని రచనలో లేదు.

కలడు, కలరు అను వానిని నన్నయ సామర్థ్యార్థ ద్యోతకములుగా కూడ వాడియున్నాడు. "పరులు కలరే కర్ణునోర్వ" అను దానియందువలె అవి వ్యస్తముగా కూడ వాడఁబడినవి. ఆశీరర్థమున భారతము వ్రాత ప్రతులలో, ఎడు, త అను ప్రత్యయములు కాక ఎడమని అనురూపము కానవచ్చుచున్నది. హిమకరుఁ దొట్టిపూరు భరతేశ అనుచోటవలె నన్నయ భారతమున తొట్టుధాతువుయొక్క క్త్వార్థకరూపమొక్కటియే కానవచ్చుచున్నది. ఇప్పుడు తుమున్నర్థకములపై ఉపక్రియలుగా వాడఁబడు వలయు,పోలు, అను ధాతువులతని రచనలో స్వతంత్రము గను తుమున్నర్థకమునకు ముందును వెనుకను గూడ వాడబడియున్నవి. 'వలవదు' అను వలచు ధాతువుయొక్క అమహద్వ్యతిరేక తద్ధర్మరూపమును తుమున్నర్థక రూపములపై 'రాదు తగదు' అను నిషేధార్థములందు అతడు వాడుచుండును. 'అమలిన తారకాసముదయంబుల నెన్నను' అనుచోటవలె అతడు తుమున్నర్థకము లను పెక్కుచోట్ల భావార్థకములుగా వాడియున్నాడు. అతని రచనలో ఉత్తరము అను ముదర్ణాంతరూపముమీద ఇంచు ప్రత్యయము చేర్చిన ఉత్తరమించు అను ధాతురూపము కనబడుచున్నది. శాసనమునందుగల తూర్చించు అను రూపమునుబట్టి ఇట్లూహింపవలసి వచ్చుచున్నది.

నన్నయ భారతములో ఏని అనుపదము నేని హలాదిగా కనబడుచున్నది. (నీవునుచూచి తట్టి సభనేని కనంబడదే యుగంబులన్) ధాతువులపై భావార్థమున డుప్రత్యయముచేర్చిన రూపము లాతని రచనలో రెండు మూడు కనవచ్చుచున్నవి. తెలంగాణమున ఇప్పటికీ నిట్టి ప్రయోగము కలదు. యథాశక్తి, యథాక్రమము అను అవ్యయీభావసమాసము లాతని వచనంలో విభక్త్యంతరూపములతో నున్నవి. 11వ శతాబ్దికి పూర్వమందున్న శాసనములలోవలె అతని రచనలో కూడ అగు ధాతుక్రియారూపము లేకుండగనే పెక్కు వాక్యములు కనబడును. "నిండుమనము

నవ్యనవనీత సమానము". అట్లే ధాతుజ విశేషపూర్వకములైన విశేష్యములే కొన్నిన చోట్ల క్రియాకార్యమును కూడ నిర్వహించును. ఇది నాచేసిన మర్యాద" (ఆది 4.271). అతని కూతురు సుకన్య అనునది మున్నగు తచ్ఛబ్దానుప్రయోగముతో కూడిన ధాతుజవిశేషములు నన్నయ రచనములో తరచుగా విశేష్యముల తరువాతనే కనబడుచున్నవి. నన్నయ సంస్కృత సంప్రదాయానుసారముగ "నీకు నభివాంఛిత మెయ్యది దాని చెపుమ" (ఆది 1-109) మున్నగు యత్తదర్థకములతోకూడిన వాక్యములు అతని రచనలో గనబడును. అట్లే యదా తదా,యథా తథార్థకములతో కూడిన వాక్యములు కూడ చాలకలవు. ఎడనెడనతడు కర్మణ్యర్థక వాక్యములను కూడ వాడియుండెను. "వాడు తనయుఁడనంబడునే" (ఆది 3-199) "బ్రహ్మచేత నను జ్ఞాతుండై" అను దానియందువలె అతడు కర్తృపదములకు చేత, చే అను వానిని చేర్చి సంస్కృత క్తప్రత్యయాంత రూపములనుకూడకర్మణ్యర్థమున వాడుచుండును. అతని రచనలో దీర్ఘవాక్యములనడును-అని కద్రువ వినతంజూచి "చూడవే! అల్ల అతిధవళంబైన అశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె వాల ప్రదేశంబునందు నల్లయైయున్నది". అనుచోటవలె ప్రత్యక్షవచనములు కూడ గోచరించును. వచనమున ముగియని వాక్యము నొకప్పుడుడతడు తరువాతి పద్యములోనికి కొనసాగించుచుండును.

కపిలగడ్డము, కపిలజడలు కపిలకన్నులు కఱకంఠుడు మున్నగునవి అనింద్యగ్రామములని చిన్నయసూరి తెల్పియుండెను. 'అవసరజ్ఞుండయి వ్యాసుడే తెంచె' అను మధ్యాక్కరలో ప్రాసస్థానమున కపిలగడ్డము అనురూపము వాడఁబడినది. దీనినిబట్టి నన్నయ వ ప లకు ప్రాసమైత్రి నంగీకరించెనని చెప్పవలసియుండును. కాని ప్రౌఢవ్యాకర్త కవిల యనునది కపిలశబ్దము యొక్క వికృతి యని చెప్పుచున్నాడు. అట్లే అతడు గరకంఠశబ్దభవము కఱకంఠశబ్దమని సూచించియున్నాడు. అతని ననుసరించి ఇవి గ్రామ్యములేకావు. సురకరువతి అను సమాసములోని సురశబ్దము దేశ్యమే. ఆ శబ్దమున్నకు సుడిగాలి అని యర్థము.

ఛందోవిశేషములు :-

నన్నయకు పూర్వమందలి శాసనములలో ఒక్క కామసాని గూడూరు శాసనమున తప్ప, మఱెక్కడను మార్గపద్ధతికి చెందిన వృత్తములు కనబడవు. ఈ గూడూరు శాసనము నన్నయకు పూర్వమున్నది కాదని కొందఱి యభిప్రాయము. అప్పటి శాసనములలో తరువోజ, సీసము, మధ్యాక్కర మున్నగు దేశిపద్ధతికిచెందిన పద్యములే కనిపించును. నన్నయ సంస్కృతము నుండి పెక్కు శబ్దములను గ్రహించినట్లే కొన్ని వృత్తములను కూడ గ్రహించియుండెను. అతడు రచించి

భారతభాగమున మొత్తము గద్య పద్యముల సంఖ్య 3983, వానిలో పద్యములు 2487, చంపకమాలలు-240, ఉత్పలమాలలు-184, శార్దూలములు-18, మత్తేభములు-61, కందములు-1219 మధ్యాక్కరములు-39, మధురాక్కర-1, సీసములు-251, ఆటవెలదులు-195, తేటగీతులు-177, తరువోజలు-12, దండకము-1 మిగిలినవి స్రగ్ధరాద్యన్యవృత్తములు, దీనినిబట్టి ఆతడు కందముల నెక్కువగా వాడినట్లు తెలియుచున్నది. నన్నయ భారతమున పృథ్వీవృత్తములైదు కలవు. సంస్కృతమున దానికి తొమ్మిదవ యక్షరము యతి స్థానము. నన్నయ దానిని 12వ యక్షరమునకు మార్చెను. అప్పకవి మున్నగువారు పద్మకవృత్తమున 11వ యక్షరమును యతి స్థానముగా పేర్కొనగా నన్నయ 8వ యక్షరమును యతి స్థానముగా గ్రహించెను. కవిజనాశయము మానినీవృత్తమందు 3వ యతిస్థానములను పేర్కొనుచున్నది. నన్నయ పదునూడవ యక్షరము నొక్కదానినే యతిస్థానముగా గ్రహించెను. తిక్కన కొన్నిచోట్ల మూడు యతులను, కొన్నిచోట్ల ఒక్కయతిని పాటించెను. అప్పకవి నన్నయ పద్ధతినే అనుసరించెను. కవిరాజ విరాజితమున లాక్షణికులు యతిత్రయమును నిర్దేశింప నన్నయ పదునాల్గవ యక్షరము నొక్కదానినే యతిస్థానముగా గుర్తించెను. అరణ్యపర్వమున అర్జునుడు శివుని స్తుతించిన సందర్భమునఁగల దండకములో చివర గురువుతోఁ గూడిన పెక్కు తగణములున్నవి.

పూర్వమహాకవులలో నన్నయయు, ఎఱ్ఱన అరణ్యపర్వశేషమునందును తప్ప మఱెవ్వరును మధ్యాక్కరలను వాడియుండలేదు. నన్నయ తనకు పూర్వపు శాసనములందలి మధ్యాక్కరలలోవలె పంచమ గణాదిని యతిగా పాటించెను. లాక్షణికులు చతుర్థగణాదిని యతిస్థానముగా నిర్ణయించిరి. ఎఱ్ఱన మధ్యాక్కరలలో చతుర్థగణాదినే యతి వేసియుండెను. నన్నయ మధ్యాక్కర లందలి పదునారు పాదములలో గణములు వ్యత్యస్తముగా కనఁబడుచున్నవి. గణములకుగాని భాషా విధానమునకు గాని భంగము రాకుండా కొలది మార్పులుగావించి వానిని లక్షణానుగుణములు చేయవచ్చును. కాని అయిదు పాదములలో మాత్రము ['ఏ మేముమున్ను పూజింతుము. రుద్రునిందని వేడ్క' (అర 2.255)] మున్నగువానిలో వ్యత్యాసము నెట్లు తొలగింపవలయునో పరిశీలింపవలసియున్నది.

సీసములు :- కవిజనాశ్రయము సమము, విషమము అని సీసమును ప్రధానముగా రెండు తెఱగుల విభజించి సమము మరల నైదు విధములని చెప్పుచున్నది. దాని ననుసరించి సీసము మొత్తమారువిధములు. విన్నకోట పెద్దన ఈ ఆఱింటినే పేర్కొనెను. అనంతుడు పది సీసభేదములు చెప్పెను. అప్పకవి విషమసీసమునందారు భేదములను అనగా మొత్తమేడు విధములు చెప్పి నన్నయ వానిని

భారతమున వాడినట్లును, ఇతరకవులు సమసీసము నొక్కదానినే వాడినట్లును తెల్పియున్నాడు. కాని నన్నయ భారతమున అప్రాకవి ప్రాసనీసము వృత్త ప్రాస సీసము అను మూడువిధములే గోచరించుచున్నవి. ఎనిమిదిచోట్ల యతియు నియమము కలవి, ఎనిమిది చోట్ల ప్రాసనియమము కలవి, పూర్వార్ధమున ప్రాసమును పశ్చిమార్థమున యతియు కలవి. పూర్వార్ధమున యతియు. పశ్చిమార్థమున ప్రాసమును కలవి. అని సీసపాదమును నాలుగు రకములుగా విభజింపవచ్చును. అట్లే గీతపద్యమున నాలుగు పాదములందును యతి నియమము కలవి, నాలుగు పాదములందును ప్రాసనియమము కలవి, బేసి పాదములందు యతియు, సరిపాదములందు ప్రాసము కలవి, బేసి పాదములందు ప్రాసము, సరిపాదములందు యతియు కలవి అని నాలుగు విధములుగా విభజింపవచ్చును. సీస గీత భేదములను రెండును కలిపినచో పదునారు భేదము లేర్పడును. వానిలో పదమూడింటిని మాత్రమే నన్నయ వాడియున్నాడు. అతడు ఆటవెలదులతో కూడిన 225 సీసములను, తేటగీతులతో కూడిన 26 సీసములను మొత్తము251 సీసములను వాడియున్నాడు.

క్ష కార జ్ఞ కార విషయమున నన్నయ పాటించిన యతినియమమిదివఱకు చెప్పఁబడినది. రేఫముతో కూడిన యక్షరములలో నీతడు రేఫమునకుకాక అన్యహల్లునకే యతిమైత్రినికూర్చుచుండును. క్ష మొదలగు మూడు హల్లులతో కూడిన అక్షరములందు అతడు తుది హల్లునకే ప్రాముఖ్యమొసగుచుండును. చతుర్థి విభక్తి ప్రత్యయమైన కై అనునది, 'కు + ఐ' అను దాని కూడిక యగుటచే "అనఘ మా మామ శకుని నాకై కడంగ" అను దానియందు వలె అతడచ్చునకే యతి వేయును. అతని రచనలో నాలుగైదుచోట్ల అఖండ యతులు కానవచ్చుచున్నవి. "పల్వాం, బెకడున్ మేలనగ శాంతిపర్వము వెలయున్" (ఆది 1-57) అనునది యందులకొక నిదర్శనము. "దుఃఖంబునైనెడ విమోహమును పొంది" (అర 4.27) అనుచోట-ఖ-కు పూర్వము విసర్గముండుటచే అతడు దానికిని హకారమునకును యతివేసియున్నాడు. అతడు సహజ మకారద్విత్వమునకును, ప్రాసస్థానమున ద్రుతమునకు మకారము పరమగుచో నేర్పడు ద్విత్వమునకును ప్రాసమువేసి యున్నాడు. "కమ్మని లతాంతములకు న్మొనసియాడు" అను పద్యమిందుకు దృష్టాంతము. "కాదన కిట్టిపాటి యుపకారము తక్షకుఁడేక విప్ర సంబోధనఁజేసి చేసె" అనుచో స్వవర్గజప్రాసమున్నది. కొందఱు సంబోధన శబ్దమునకు సంబోదన వికృతిరూపమని చెప్పుదురు.

నన్నయ రచనలో కొన్నిచోట్ల సంయుక్తాక్షరమున ద్వితీయాంగముగనున్న రేఫమును తేల్చి వలుకవలసివచ్చును. "కం. తలరగ రేణుకక్రథన ప్రవిహ ప్రరుజాశ్వ కృంత పదనఖులను" (ఆది 2.100), నక్షత్రయుతుండుగా శశిప్రకాశ

ఇయోన్నతమైన అష్టమిన్ (ఆది 5-94) అమ్మునివ్రవరు వృథాత్సంగ తలముపై పడి(బడియెన్ (సభా. 1-42) అను పద్యములలోని ప్రథన, ప్రకాశ, ప్రవర శబ్దములందలి రేఫమును తేల్చి పలుకవలసియున్నది. లేనిచో గణభంగమగును.

నీతి ధర్మములను తెల్పుటకు నన్నయ సాధారణముగా కందపద్యములను వాడుచుండును. అతడు రెండుచోట్ల ఉత్సాహవృత్తమును వాడెను. అవి రెండును ఉత్సాహసూచకములైనట్టివే. మందగమనముగల మధ్యాక్కరవృత్తముల నాతడు సాధారణముగా దుఃఖక్లేశ వర్ణన సందర్భములందు వాడియుండెను. వర్ణనములకును, కథా కథనములకును వస్తువ్యక్తినామముల పట్టికలను చెప్పుటకును అతడు సీసములను వాడుచుండును, సంభాషణ సందర్భములందు లయగ్రాహిని, వీరరౌద్ర రసోపేత సన్నివేశములందు మహాస్రగ్ధరను అతడు వాడియుండెను. అతడు సీసములను వచనములను సమాన ప్రయోజనములకై వాడియుండెను. నీరస విషయములను వర్ణించుటకాతడు వచనమునే వాడుచుండును.

నన్నయ ఆదికవి యయ్యెను, ఉదాత్తసుందరమైన రచనకావించి తరువాతి యాంధ్రకవుల కెల్లరకును మార్గదర్శకుడయ్యెను. వారందఱునాతని గురువుగా భావించి తమ తమ కావ్యారంభములందు స్తుతించియుండిరి. సంస్కృతమున లౌకిక వాఙ్మయమునకు వాల్మీకి మహర్షి ఎట్టివాడో ఆంధ్రవాఙ్మయమునకు నన్నయ అట్టివాడు-ఇరువురునాది కవులయ్యె అనన్యలభ్యమైన కవితామార్గమును తీర్చిదిద్దియున్నారు. వాల్మీకి ఋషియే. నన్నయ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు ఋషివంటివాడు-రెండవ వాల్మీకి. "నానృషిఃకురుతే కావ్య"మ్మను లాక్షణికుల సిద్ధాంతము వారిరువురి యెడను అన్వయించును. తిక్కన అతనిని విద్యాదయితుడు, ఆంధ్ర కవిత్వవిశారదుడనియు. శ్రీనాథుడు కవితాపట్టాభిషిక్తుడనియు, జక్కన శబ్దశాసనవర్యేణుడనియు ప్రశంసించియుండిరి. అతడు తన రచనచే ఆంధ్రభాషను, ప్రేరకుడైన రాజరాజ నరేంద్రుని పవిత్ర మూర్తులను కావించియున్నాడు.

వాచామంధ్ర మయీనాం యః
ప్రవక్తా ప్రథమోఽభవత్
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగనుశాసనమ్.

మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగు తల్లీ

— శంకరంబాడి సుందరాచార్య